# సంఘనాయకులు

(నాటకం)

మూలం :
ఇబ్సన్

అనుకృతి :
రాధాకృష్ణమూర్తి

ప్రజాసాహిత్య పరిషత్తు,
మారీసుపేట - తెనాలి.

# పరిచయం

ఆధునికయుగంలో ఇబ్సన్ గద్యనాటకానికి మార్గదర్శి. అంతే కాదు. అంతవరకు కొన్ని కట్టుబాట్లకు లోబడి జరుగుచున్న నాటక రచనాపద్ధతిని అధిగమించి ఇబ్సన్ నూతన దృక్పథంలో నాటకం సృష్టించి ముందు రచయితలకు మార్గదర్శకుడయ్యాడు.

ఇబ్సన్ సృష్టించిన పాత్రలు కేవలం ఏఒక్క జాతికి, దేశానికి చెందినవికావు. మొత్తం మానవసంఘాన్ని దృష్టిలోపెట్టుకొని అతడు తన పాత్రల్ని సృష్టించాడు. అతని పాత్రలు వూహకు మించినవికావు. నిత్యం మనం కళ్లముందు చూస్తూవుండే పాత్రల్నే, సర్వసాధారణముగా ప్రతివ్యక్తీ అనుభవిస్తూవుండే అనుభవాలనే అతడు ఆధారంగా తీసుకొని పాఠకుల హృదయానికి హత్తుకుపోయేవిధంగా నాటకసృష్టి చేశాడు.

"భార్యను ఆటబొమ్మగా వాడుకోటం అనర్థకం— రాజకీయాలు వృత్తిగా చేపట్టినవారిలో హెచ్చుమంది మోసకారులు— ఆత్మగౌరవంగల వ్యక్తి వ్యాపారంలో లాభాలు రాగలపనులు చేయటానికి వెనుకంజ వేస్తూవుంటాడు—సుఖదుఃఖాల్లో భాగస్వాములుగా వుండే భార్యాభర్తల అనురాగం ఒకరిపై నొకరికి పెరుగుతూ వుంటుంది— ఏభై అరవై సంవత్సరాల వృద్ధుడు పదిహేను, పదహారు యేండ్ల యువతిని ప్రేమించటం మూర్ఖత్వం— ప్రకృతి సహజ వాంఛలను తీర్చుకనే స్త్రీ, పురుషులను ప్రస్తుత సంఘం క్రూరంగా చూస్తుంది—" ఇబ్సన్ నాటకాల్లో యిలాంటిభావాలు కనబడుతూ వుంటవి. ఇబ్సన్ తన భావాల్ని డొంకతిరుగుడుగా, సామాన్యులకర్థంగాని దృక్పథంలో వుంచడు. చిన్నచిన్న మాటల్లో, స్పష్టంగా అందరికీ అర్థంఅయ్యేవిధంగా అతని రచన వుంటుంది.

ఇబ్సన్‌లో మరొక నైపుణ్యంకూడా వున్నది. అతడు కళావేత్త. నీతిపరుడు. అతని రచన ప్రచారానికి బద్ధంకాకుండా నీతి

ధాన్యమైన కళాసృష్టికే హెచ్చుస్థానం యిస్తూవుంటుంది. అతని ఏనాటకం చూచినా సమస్యా పరిష్కారంగా వుండదు. ప్రతి విష యాన్ని ప్రశ్నించటమే అతని ముఖ్యసూత్రంగా కనబడుతూ వుంటుంది. ప్రస్తుత సంఘంలోవున్న ప్రజల మనస్తత్వాలను, ఉద్వే గాలను, కోరికలను, అనుభవాలను చిత్రిస్తూ "ఇదుగో సంఘం, ప్రభుత్వం, ప్రజలు — స్త్రీలు, పురుషులు, నాయకులు యీ పరిస్థి తుల్లో వున్నారు. మీ అభిప్రాయంయేంటి ? ఏంచేస్తారు ?" అని ఇబ్సన్ ప్రశ్నిస్తాడు.

ప్రస్తుత నాటకం ఇబ్సన్ రచించిన "పిల్లర్స్ ఆఫ్ సొసైటీ"కి స్వేచ్ఛానువాదం. ఇందులోకూడా ఇబ్సన్ "ఇదుగో మీ సంఘం, మీ నాయకులు, మీ నాయకుల మోసం, మీరేమంటారు?" అని ప్రశ్నిస్తున్నాడు.

ఒకరు ఇబ్సన్‌ని మీ ఆదర్శం ఏంటనిప్రశ్నిస్తే "నేను వ్రాసే నా మాటలశక్తి మీ హృదయానికి తాకి మిమ్మల్ని కలవరపెట్టి, లేపి పరిస్థితులను పరిశీలించగలిగేటట్లు చేయటమే నాముఖ్యాదర్శం" అని సమాధానం చెప్పాడు.

ఈ నాటకంలో పాఠకులు అలాంటి భావన పొందగలిగితే నా యీ అనుకరణ చక్కగా జరిగినట్లే నేను భావిస్తాను,

ఈ నాటకం 1877 లో రచించబడ్డది. అయినా నేటి మన సంఘానికిది చక్కగా వర్తిస్తుంది.

—రాధాకృష్ణమూర్తి

# పాత్రలు

| | |
|---|---|
| రాజారామ్:— | నౌకాపారిశ్రామిక వేత్త. |
| కమలాదేవి:— | అతనిభార్య. |
| రాంబాబు:— | వారికుమారుడు, (పదమూడేండ్లవయస్సు.) |
| వనకుమారి:— | రాజారామ్ చెల్లెలు. |
| బాబూరావు:— | కమలాదేవితమ్ముడు. |
| శోభాదేవి:— | కమలాదేవిమారుఅక్క. |
| జగదీశ్:— | కమలాదేవి పెత్తల్లికొడుకు. |
| వాసంతి:— | రాజారామ్ ఇంట్లో నివసిస్తున్న పరాయియువతి (16 ఏండ్ల వయస్సు.) |
| వివేకానందుడు:— | స్కూలుమాష్టరు. |
| విశ్వేశ్వరరావు, గుణచంద్, కృష్ణపిళ్ళె:— | వ్యాపారస్తులు. |
| నటేశం:— | రాజారామ్ ఆంతరంగిక గుమాస్తా. |
| శ్యామలరావు:— | రాజారామ్ నౌకానిర్మాణ శాఖలో ఫోర్మెన్. |
| సులోచనాదేవి:— | విశ్వేశ్వరరావుభార్య. |
| మీనాక్షి:— | ఆమెకుమార్తె. |
| శకుంతలాదేవి:— | |
| సరోజిని:— | ఆమెకుమార్తె. |
| జ్ఞానాంబ:— | |

ఇంకా

బస్తీజనం, ఓడ ప్రయాణీకులు, ఇతరదేశస్తులు మొదలైనవారు.

స్థలం:—సముద్రపు కోస్తాలో వున్న ఒక సాధారణ బస్తీలోని రాజారామ్ యిల్లు.

# మొదటి అంకం

(రాజారామ్ ఇల్లు. విశాలమైన గదులు, పెద్దహాలు, హాలుముందు వరండా. చుట్టూతోట. తోటచుట్టూ ప్రాకారం. ప్రాకారానికి ముందు, వెనుక బజార్లు. ముందుబజార్లో చిన్న, చిన్న దుకాణాలు, వస్తూ, పోతూవుండే జన సముదాయం యెప్పుడూ కనబడుతూ వుంటుంది.)

(ఒక ప్రక్కగదిలో కమలాదేవి, ఆమె చుట్టూ శకుంతలాదేవి, ఆమెకూతురు సరోజిని, సులోచనాదేవి, ఆమెకూతురు మీనాక్షి, జ్ఞానాంబ, వనకుమారి, వాసంతి కూర్చొని కుట్టుపనులు చేసుకుంటూ వుంటారు. వివేకానందుడు ఒక పుస్తకం చదువుతూ మధ్యమధ్య వాఖ్యానం చేస్తూవుంటాడు. రాంబాబు బయట తోటలో ఒక విల్లు, అంబులు తీసుకొని చెట్లకాయలకు గురిపెట్టి కొట్టుతూ వుంటాడు)

(కొద్దికాలానికి శ్యామలరావువచ్చి తొంగిచూస్తాడు. అందరు పనిఆపి అతని వంక చూస్తారు. కమలాదేవి ప్రక్కగదికి దారిచూపుతూ మూసివున్న ద్వారంవంక వేలు చూపుతుంది. శ్యామలరావు ఆద్వారం దగ్గరకు వెళ్ళి నెమ్మదిగా ఒకటి, రెండు సార్లు తలుపుతట్టుతాడు. కొంచెం ఆలస్యంగా నటేశం చంకలో కాగితాల కట్టపెట్టు కొని బయటికి వస్తాడు.)

నటేశం :-(మెల్లగా) ఓ ! మీరా తలుపు తట్టింది.

శ్యామలరావు :-అయ్యగారు కబురు చేసారు.

నటే:—అవును. కాని వారికి రావటానికి వీల్లేదు. వారి తరఫున నన్ను చెప్పమని...

శ్యామ:—ఆఁ !

నటే:—ఆఁ. నన్ను చెప్పమన్నారు. మీరు మీ క్రిందవున్న పనివాళ్ళకు ఆదివారం వుపన్యాసాలు యివ్వటం కట్టిపెట్టాలి.

శ్యామ:—నిజంగానా ? సెలవు దినాల్లోకూడా—

నటే:—ఆఁ. సెలవుదినాల్లోకూడా మీయిష్టం వచ్చినట్లు సంచరించకూడదు. దానివల్ల పనివాళ్ళు చెడిపోతారు. క్రిందటి ఆదివారం మీరు పనివాళ్లకు

మనం క్రొత్తగా తెప్పించిన మిషన్లగురించి వాటివల్ల పనివాళ్ళకు ప్రమాదం జరుగుతుందని చెప్పావుగదూ?

శ్యామః—అవును. సంఘక్షేమం కోసమే నేను చెప్పాను.

నరే:—ఛీ! ఇలాంటి వుపన్యాసాలు సంఘాన్ని విచ్ఛిత్తు చేస్తపని రాజారామ్‌గారి అభిప్రాయం.

శ్యామః—రాజారామ్‌గారి సంఘం, నాసంఘం ఒకటికాదు నరేశంగారూ. పారిశ్రామిక వర్కర్ల సంఘం అధ్యక్షుణ్ని కనుక నేను—

నరే:—నీవు అన్నిటికంటె ముందు రాజారామ్‌గారి నౌకా నిర్మాణశాఖ అధ్యక్షుడివి. కనుక నీవు అన్నింటికంటె ముందు 'రాజారామ్‌కంపనీ' అనే సంఘాన్ని రక్షించే బాధ్యత వహించవలసి వుంటుంది. అవునా? ఇదే రాజారామ్‌గారు నీకు చెప్ప దలచుకున్నది.

శ్యామః—రాజారామ్‌గారు ఇలా చెప్పమని వుండరు. ఇదియెక్కడనుంచి వచ్చిందో నాకుతెలుసు. ఆ అమెరికా ఓడకు సంబంధించిన వాళ్ళ దగ్గరనుంచే వచ్చింది. అక్కడ వర్కర్లచేత రాత్రిం బవళ్ళు వాళ్ళు చేయిస్తున్నట్లే యిక్కడకూడా చేయించాలని వారికోర్కె.

నరే:—అవును. అవును. వివరంగా మాట్లాడటానికి ఇప్పుడు తీరికలేదు. వెంటనే పనిలోకివెళ్ళు. నేనుకూడా ఇప్పుడే వస్తాను—బుద్ధిమంతుడవు అనిపించుకోవాలి—

('క్షమించండి' అని అక్కడ స్త్రీలను ఉద్దేశించి అంటూ నరేశం బయటకి వచ్చి బజార్లోకి వెళ్ళుతాడు. శ్యామలరావుకూడా నెమ్మదిగా బయటికి వెళ్ళిపోతాడు. వివేకానందుడు యీ మధ్యలో పుస్తకాన్ని చదవటం పూర్తిచేసి మూసివేస్తాడు)

వివేకానందుడు:—అదీ అసలు విషయం.

సులోచనాదేవి:—మంచి హితదాయకమైన కథ.

శకుంతలాదేవి:—చక్కని నీతిని బోధిస్తున్నది.

కమలాదేవి:—అలాంటి పుస్తకాలు నిజంగా ఆలోచించటానికి కావలసినంత అవకాశాన్ని కల్పిస్తవి.

వివే:—అవును. అవును. మనం రోజూ పత్రికల్లోచూసే విషయాలకు దీనికి యెంతభేదం కనపడుతుంది. పై మెరుగులతో వుండే ఈ సంఘాన్ని పరికించండి. లోపలయేమీవుండదు. మేడిపండు. పైగా క్రుళ్ళి పురుగులు లుక, లుకమంటూ వుంటవి. నిజం చెప్పాలంటే ఈసంఘానికి 'నీతి' అనే పునాది యెక్కడా కనబడదు.

శకుం:—నిజం ! నిజం !

సులో:—ఇందుకు వుదాహరణకోసం మనం యెక్కడికో వెళ్ళనక్కర్లేదు. —ఒడ్డున ఆగివున్న ఆమెరికన్ ఓడలోని జీవితాల్ని చూస్తేచాలు.

వివే:—ఓ ! నాగరికతలో ఎంతో ముందుకు వెళ్ళామనుకుంటున్న సంఘాలలోకూడా యింతే. ఎక్కడ చూచినా సందేహం, భయం. విశ్రాంతి వుండదు. శాంతికనబడదు—చూడండి. అక్కడ కుటుంబ జీవితం ఎలా కుంటుపడుతున్నదో. యెంత గొప్ప సత్యాన్నైనా వారు తేలిగ్గా అనుమానిస్తూ వుంటారు.

వాసంతి:—(కుట్టుపని చేసుకుంటూనే) అక్కడే పెద్దపెద్దపనులు చేస్తూ వుంటారు కదూ ?

వివే:—పెద్ద పనులా? అంటే నాకు అర్థంకాలేదు. అలాంటి 'పెద్ద పనులు' ఎన్ని జరిగినా ఒక మంచి కార్యం కాజాలదు. మన సంఘం ఆలాంటి నాగరికతకు దూరంగా వున్నందుకు నాకు చాలా సంతోషంగా వున్నది.

సులో:—అవును. క్రిందటి సంవత్సరం మనకు రైలుపడేది. దేవుని దయ వల్ల తప్పించుకున్నాము.

కమ:—దానికి కారణం మావారే.

వివే:—నీభర్త నిజంగా దేవదూత. ఆయన ప్రతిభావిశేషం వల్లనే మనం రైలు యిక్కడకు రాకుండా చేసుకోగలిగాము.

కమ:—సంఘానికి మంచి చేసినా సంఘం గమనించదు. అప్పుడువారిని గురించి పత్రికలలో దూషిస్తూ ఎన్నో విమర్శనలు పడ్డవి.

వివే:—సంఘం యదార్థాన్ని నెమ్మదిగా గ్రహిస్తుంది. నిజంగా మీప్రశాంత జీవితం—మీకుటుంబం — మీ అన్యోన్య అనురాగం—మీసంఘసేవ

తక్కిన సంఘానికి ఆదర్శప్రాయం. చూడు ! సంఘంలో ఎంతమంది దరిద్రులు, అనాధులు యుద్ధంలో వికాలాంగులయిన సైనికుల్లాగా అలమటిస్తున్నారో? నిజంగా అలాంటివారి సేవయే నిజమైన సంఘసేవ. మీలాంటిస్త్రీలు, సుతిమెత్తనిహృదయంగలవారి చేతులు సోకగానేవారి శరీరకష్టాలు, మనోబాధలు నామరూపం లేకుండా హరించుకొనిపోతై.

కమ:—అలాంటి విశాలభావజ్యోతిని కలిగి వుండటం నిజంగా అదృష్టమే.

వివే:—అందులో చాలభాగం పుట్టుకతోనే వుంటుంది. కాని అంతకంటె హెచ్చుగా సంపాదించటానికికూడా అవకాశంవున్నది. అందుకు జీవితంలో ప్రతిచిన్నవిషయాన్ని లోతుగా, సక్రమంగా అర్థంచేసుకోవలసి వుంటుంది. (వనకుమారితో) మీరేమంటారు? మీరు మీకాలన్నంతా స్కూలుపనికే వినియోగిస్తున్నారంటే నిజంగా మీరు జీవితాన్ని యీ విధంగా అర్థం చేసుకుంటున్నారని చెప్పవచ్చు.

వన:—ఏం చెప్పాలో నాకు అర్థం కావటంలేదు. అప్పుడప్పుడూ స్కూల్లో ఏకాంతంగా కూర్చున్నప్పుడు నాలోనేను ఎక్కడికో-చాలా-చాలదూరం సముద్రంలో వీచే తుఫాను మధ్యకు వెళ్ళాలని అనిపిస్తూవుంటుంది.

వివే:—అది కేవలం మీ ఉద్వేగాన్ని ప్రకటింపచేస్తుంది. అలాంటి సమయాలలో మీరుమీమనస్సుని కట్టుదిట్టంలో వుంచుకోవటం అవసరం. 'సముద్రంలో వీచేతుఫాను' అంటే మీరు బహుశః సంఘంలో వ్యాపించిన అశాంతిని గూర్చి అంటున్నారనుకొంటాను. నిజంగా అంతే. చూడు. అబజారులో విధివిరామంలేకుండా జనం అయినదానికీ, కాని దానికీ అటూ యిటూ తిరుగుతూ ఉంటుంది. ఎందుకో, దేనికో అర్థం కాదు. అలాంటి అవస్థకు పాలుకాకుండా ప్రశాంతంగా మసలు వారి కంటె ఎన్నోరెట్లు మెరుగు.

వన:—అవును. అవును. మీరు చెప్పేది ముమ్మాటికి సత్యం. (ప్రక్క గదిలోనుంచి పెద్దగా మాటలు వినబడుతూ వుంటవి)

వివే:—ఎవరో లోపల మాట్లాడుతున్నారు. (కమలాదేవితో) ఏమైనా ప్రత్యేకత లేదుగదా?

కమః—(ఆలకించి) ఏమో? ఎవరో నాభర్తతో మాట్లాడుతూ వున్నట్లున్నది

(జగదీశ్ చుట్ట కాలుస్తూ లోపలికి వస్తాడు. వెంటనే ఆడవాళ్ళు వుండడం గమనించి ఆగి వెనక్కు మరలుతాడు)

కమః—రా! రా! జగదీశ్! మాపనికేమీ విఘ్నంలేదులే. ఏదైనా పని వున్నదా?

జగః—(వెనక్కు తిరిగి) ఏమీలేదు. వూరకేవచ్చాను. (కమలాదేవితో) సరే! ఏంజరిగింది?

కమః—దేన్ని గురించి?

జగః—నీకు తెలియదేంటి? రాజారామ్ మీటింగు పెట్టాడు.

కమః—ఆఁ. ఎందుకు?

జగః—అదే! ఆరైల్వేగొడవ మళ్ళీ వచ్చింది.

వివేః—అదేంటి జగదీశ్‌గారూ? గత సంవత్సరం రైల్వే నిర్మాణం వల్లకాదన్న వారిలో రాజారామ్‌గారు ప్రథములు.

జగః—అవును. నాకు అదంతాతెలుసు. కాని ఇప్పుడే గుమస్తా నటేశం గారు నాతో చెప్పారు. మళ్ళీ రైల్వేనిర్మాణం గురించి ఆలోచనలు జరుగుతున్నవట. అందుకోసం రాజారామ్ మన బస్తీలోని వ్యాపారస్థులతో సంప్రదింపులు జరుపుతున్నాడట కూడాను.

సులోః—అవును. నాభర్తగారి నోటినుంచి యీ మాటలు విన్నాను.

జగః—యీసంభాషణల్లో విశ్వేశ్వరరావుగారు వొకరు. తక్కిన యిద్దరిలో వొకరు గుణచంద్, రెండోవారు కృష్ణపిళ్ళె.

వివేః—సరే! బాగానే వున్నది.

(రాంబాబు విల్లు, అంబులు పట్టుకొని తోటలోనుంచి వస్తాడు.)

రాంః—నేనేంచేసి వచ్చానో తెలుసా మామయ్యా!

జగః—అరే! నీకు యింకా ఆపాడు విల్లు, అంబులు ఎందుకురా? తుపాకి ఎందుకు పట్టుకోవు?

రాంః—తుపాకి కావాలనే వున్నది. కాని—

జగః—నిజంగా తుపాకి పట్టటంలోనే అందంవున్నది. నీవు కాలుస్తావుంటే అందులో కొంత వుషారు కనబడుతుంది.

రాం:— అప్పుడు నేను పులుల్ని, సింహాల్నికూడా కాల్చివేస్తా, కానినాన్న తుపాకి పట్టుకోనివ్వడు.

కమ:—జగదీశ్ ! నీవు వాడికి అలాంటి బుద్ధులు నేర్పబోకు.

జగ:—మనం మాటలలో చాలా పెద్దగా కనబడతాము. కాని క్రియలో శూన్యం. పిల్లలకు చిన్నతనంనుంచి ఆటలలో శ్రద్ధకలిగించి వారికి క్రమశిక్షణ అలవాటుచేస్తూ వీరపుత్రుల్నిగా చేయవలసిన బాధ్యత వహించాలి.—అరే ! ఆవిల్లు నావంక త్రిప్పబోకు. అంబు నాకు గ్రుచ్చుకుంటుంది.

రాం:—ఇందులో అంబులేదు మామయ్యా.

జగ:—నీవు అంబు పెట్టినా పెట్టవచ్చు—మీ నాన్న వోడలో అమెరికా వెళ్ళరాదు? అక్కడ పెద్దపెద్ద అడవిగేవెల్ని వేటాడవచ్చు. రెడ్ఇండి యన్స్‌తో యుద్ధం చేయువచ్చు.

కమ:—ఓహ్ ! జగదీన్ !

రాం:—అవునవును. అమెరికా వెళ్ళాలని వున్నది మామయ్యా ! అక్కడ నేను చినమామయ్యను, పెద్ద అమ్మను చూడవచ్చు.

జగ:—ఛీ ! నోరుముయ్యి.

కమ:—బాబూ ! బయటికి వెళ్ళి ఆడుకో.

రాం:—అమ్మా ! నేను బజార్లోకి వెళ్ళివస్తా.

కమ:— దూరంగా వెళ్ళవద్దు. జాగ్రత్త.

(రాంబాబు తోటలోగుండా గేటుదాటి బజార్లోకి వెళ్లుతాడు:)

కమ:—ఇక్కడ వుక్కబోస్తూ వున్నది. బయటికి వెళ్ళదాం పదండి. (లేస్తూ వాసంతితో) వాసంతీ ! కొంచెం లోపలికివెళ్ళి కాఫీ పట్టించు కొనిరా !

(కమలాదేవి, జగదీశ్, వివేకానందుడు, వసకుమారి బయట వరండాలోకి వెళ్ళతారు. వాసంతి లేచి లోపలికి వెళ్ళుతుంది. సులోచనా, శకుంతలలు ఓర గంటితో వాసంతినిచూస్తూ ఒండొరులు తలలూపు కొంటూరు.)

జ్ఞానాంబః—(సులోచనా దేవితో వాసంతిని గురించి) ఈ పిల్ల చాలా మంచిదిగా కనబడుతున్నది.

సులో:—(నెమ్మదిగా) కాని పాపం దురదృష్టవంతురాలు.
జ్ఞా:—ఏం ! ఏందుకని?
సులో:—నీకు తెలియదూ ? కమలాదేవి తమ్ముణ్ని ఎరగవు ?
జ్ఞా:—ఎవరో? నాకేమి తెలుసు ?
సులో:—అవును ! క్రొత్తగా యిక్కడకు వచ్చినదానివి నీకు ఎలా తెలుస్తుంది? (తన కూతురితో) మీనాక్షీ ! కాసేపు తోటలోకి వెళ్ళిరా.
శకుం:—(తన కూతురితో) సరోజినీ ! నీవుగూడా మీనాక్షివెంట కాసేపు తిరిగిరా!-ఇదిగో ! చూడండి ! వాసంతితో బాగా కలిసి మెలసి తిరగండి.

(మీనాక్షీ, సరోజినీలు బయట తోటలోకి వెళ్ళుతారు.)

జ్ఞా:—(నెమ్మదిగా) కమలాదేవి తమ్ముడెవరు ?
సులో:—అతనిపేరు బాబురావు. నీచాతి నీచుడు. పెద్దతప్పుచేసి అమెరికా పారిపోయాడు.
శకుం:—అమెరికా పారిపోవలసి వచ్చింది.
జ్ఞా:—ఏం తప్పు చేశాడు?
సులో:—ఎలా చెప్పను? అతనికి, వాసంతి తల్లికి సంబంధం కలిగింది. ఈసంఘటన ఎప్పుడో జరిగి గతించిపోయినా నిన్న జరిగినంతగా నాకు గుర్తువున్నది. అప్పుడు బాబురావు రాజారామ్ తల్లిగారి ఆఫీసులో వుంటూవుండేవాడు. రాజారామ్ అప్పుడే పారిస్‌నుంచి తిరిగి వచ్చాడు. ఇంకా ఆఫీసు సంగతి పట్టించుకోలేదు.
జ్ఞా:—అసలు విషయం ఏంటి ?
సులో:—రాంభాయి కంపెనీపేరు ఎప్పుడైనా విన్నావా ?
శకుం:—అప్పుడు రాంభాయి కంపెనీవారు యిక్కడ నాటకాలు వేయటానికి వచ్చారు. రాంభాయి అంటే పెద్దపేరు మ్రోగింది. చాలా పెద్దపేరు మ్రోగింది. చాలా అందంగా ఉండేది. చూచిన పురుషుడెవడయినాసరే రాంభాయి కోసం పడి చచ్చేటంతటి సౌందర్యం వుట్టిపడుతూ వుండేది.

సులో:—ఒకనాడు రాంభాయి భర్త ఎక్కడికో వెళ్ళి రాత్రి ప్రొద్దుపోయిన తరువాత వచ్చాడు.

శకుం:—అనుకోకుండా వచ్చాడు.

సులో:—లోపల తన భార్య—ఛీ! అది చెప్పతగ్గ విషయంకాదు.

శకుం:—అతడు ఏమీచూడలేదు. తలుపు లోపల గడియ వేసివున్నది.

సులో:—అవునవును. అదే నేను చెప్పబోయేది. లోపల గడియ బిగించి, నట్లు అతడు తెలుసుకున్నాడు. ఇక చూడు లోపలవున్న మనిషి—కిటికీగుండా బయటికి దూకవలసివచ్చింది.

శకుం;—ఆ కిటికీ చాలా పైభాగంలో ఎత్తుమీద వున్నది.

జ్ఞా:—అతడు కమలాదేవి తమ్ముడేనా?

శకుం:—అవునవును. అందుకుగాను అతడు అమెరికా పారిపోవలసి వచ్చింది.

సులో:—తరువాత బయటపడింది. అతడు ఆఫీసులో వున్నప్పుడు ఎంతో డబ్బు అపహరించాడట.

శకుం:—ఏమో సులోచనా! అందులో ఎంతసత్యం వున్నదో ఎవరికీ తెలియదు. పాపం మూటకట్టుకోగూడదు.

సులో:—వొట్టిపుకార్లు నేను ఎప్పుడూ పుట్టించను. దానివల్ల రాజారామ్ తల్లి దివాళాతీసే స్థితికివచ్చిందని టవునంతా పాక్కిపోలేదూ?

శకుం:—కాని రాంభాయికి మాత్రం ఆడబ్బు ముట్టినట్టులేదు.

జ్ఞా:—సరే! తరువాత వాసంతి తల్లిదండ్రుడు లేమైనారు?

సులో:—రాంభాయిభర్త భార్యని, కూతుర్ని వదలిపెట్టి వెళ్ళిపోయాడు. తరువాత కొంతకాలంవరకు రాంభాయి బయటికి రాలేదు. నాటకాల్లో వేషం వేయటానికే గుండెలేకపోయింది. కుట్టుపనిచేసుకుంటూ జీవితం గడపసాగింది.

శకుం:—తరువాత నాట్యశాల స్థాపించాలని జూచింది.

సులో:—అలాంటి స్త్రీ దగ్గరకు ఎవరు తమ పిల్లల్ని పంపుతారు? అప్రయత్నంకూడా సాగలేదు. చివరకు హృదయ రోగంతో కుమిలి, కుమిలి ప్రాణాలు వదలింది.

జ్ఞా:— పాపం ! ఎంత అప్రతిష్ట ?
సులో:—వాళ్ళకు కాదు । గౌరవనీయమయిన రాజారామ్ కుటుంబానికిది తీరని మచ్చగా యేర్పడ్డది. ఈ యింట్లో ఆమాట ఎత్తబోకు జ్ఞానాంబ!
శకుం:—కమలాదేవిగారు అక్క విషయంకూడా యిక్కడ తీసుకరావటం మంచిది కాదు.
జ్ఞా:—ఆమె ఎవరు ?
సులో:—అదృష్టవంతులు. ఆమెతోవీరికి ప్రస్తుతం సంబంధంలేదు. ఆమె పేరు శోభాదేవి. ఆమెను చూస్తేనే చాలా యిదిగా కనబడుతుండేది. వెంట్రుకలు కత్తిరించుకుంటుంది. మగరాయుడులాగా బూట్లువేసుకొని బజార్లల్లో షికార్లు చేస్తూవుండేది.
శకుం:—బాబూరావు అమెరికా పారిపోయినప్పుడు టపుసంతా ఆట్టుడికి నట్టు వుడికిపోయింది. ఎవరినోట వినబోయినా ఆ విషయమే. అలాంటి స్థితిలో ఆమె ఏం చేసిందో తెలుసా ? అతనితోపాటు తానుకూడా అమెరికా వెళ్ళింది.
సులో:—వెళ్ళేముందు ఏం జరిగిందో తెలుసా ?
శకుం:—హుష్ ! మెల్లిగా.
జ్ఞా:—ఆమెకూడా ఏదైనా ఘనకార్యం చేసివెళ్ళిందా యేంటి ?
సులో:—ఆఁ. జ్ఞానాంబ ! ఆ సంగతి నీవుకూడా తెలుసుకోటం మంచిది. రాజారామ్, కమలాదేవి ఒకర్నొకరు ప్రేమించుకొని పెండ్లి చేసుకొవా లనుకున్నారు. ఆ విషయం చెప్పటానికి కమలాదేవి పెత్తల్లి దగ్గరకు వెళ్ళారు.
శకుం:—కమలాదేవి తల్లిదండ్రులు చనిపోయారు.
సులో:—వాళ్ళిద్దరినీ చూచి శోభాదేవి కుర్చీలో కూర్చున్న మనిషి గభాలున లేచి మర్యాదచూడకుండా పెద్దమనిషి రాజారామ్ గారిని చెవు పట్టుకొని ముందుకీ, వెనక్కూ నాలుగుసార్లు వూపిందట. రాజారామ్ గారి తల దిమ్మెక్కిపోయి నోటవెంట మాటకూడా రాలేదట. అలాగే చూస్తూ నిలబడ్డాడు,
జ్ఞా:—ఆఁ.

సులో:—నిజం. ఇక ఒకక్షణంకూడా ఆమె యిక్కడ వుండలేదు. అమెరికా వెళ్ళిపోయింది.

జ్ఞా:—బహుశః ఆమె కన్ను రాజారామ్‌గారి మీద పడివుండవచ్చు.

శకుం:—కావచ్చు. కానీ నక్కకీ నాగలోకానికి సంబంధ మేంటి? రాజారామ్‌గారి గుణాలు, మర్యాద, గౌరవం—మరి ఆమెతో—

సులో:—బంగారానికి వాసన అబ్బినట్లు ఆయన చాలా నీతివేత్త.

జ్ఞా:—శోభాదేవి అమెరికాలో ఏం చేయటానికి వెళ్ళింది?

సులో:—ఏం చేయటానికా? హొటళ్ళలో డబ్బుకోసం పాడుతూవుండేది. బహిరంగంగా వుపన్యాసాలుకూడా యిస్తూ వుండేదట.

శకుం:—ఒక పాడు పుస్తకంకూడా వ్రాసిందట.

సులో:—ప్రస్తుతం ఆమెకీ, రాజారామ్‌గారి కుటుంబానికి ఏమీ సంబంధం లేదు.

శకుం:—అయితే ఏం? అదికూడా పాపం రాజారామ్‌గారి కుటుంబానికి ఒక మచ్చేగా!

జ్ఞా:—సరే! పాపం ఆ వాసంతి సంగతేంటి? ఆ పిల్లను చూస్తే నాకుజాలి వేస్తుంది.

సులో:—ఆ పిల్లకేం? అదృష్టవంతురాలు. అలాంటి తల్లిదండ్రులచేతుల్లో పెరిగితే ఏమయ్యేది. ఇక్కడ మేమంతా చాలా జాగ్రత్త తీసుకొని హితబోధ చేస్తూవుంటున్నాము. — వసకుమారి గారే ఆ పిల్లను ఈ యింట్లో అట్టి పెట్టించారు.

శకుం:—కాని ఆపిల్లతో యేగటం చాలాకష్టం. మేమంతబోధిస్తున్నా మనసుకు పట్టిచ్చుకున్నట్లు కనబడదు. అదొకతరహా!

సులో:—హమ్! అదిగోవస్తుంది, (పెద్దగా) వాసంతి చాలామంచిది. తెలివి గలపిల్ల—ఇదుగో వస్తుంది. (వాసంతితో) నీ విషయమే మాట్లాడుకుంటున్నాము వాసంతీ!

శకుం:—వాసంతి మంచిది. కమ్మని వాసనకొట్టే కాఫీ తెస్తుంది.

కమ:—(బయట వరండానుంచి పిలుస్తూ) ఇక్కడకు రండి.

(అందరూ బయటికి వెళ్ళుతారు. వాసంతి, వనకుమారి అందరికీ కాఫీయిస్తాను. కాఫీ బాగున్నదని అందరూ వాసంతిని పొగడుతారు. వాసంతి అందరికీ కాఫీయిచ్చి తాను కాఫీ తీసుకోనకుండా గదిలోకివచ్చి కుట్టుపనిలో నిమగ్నమవుతుంది.)

కమ:—వాసంతీ ! కాఫీ తీసుకోవూ ? రా !

వా:—అక్కర్లేదమ్మా !

(వివేకానందుడు కాఫీ త్వరగా త్రాగి ఏదో పని వున్నట్లుగా గదిలోకి ప్రవేశించి వాసంతితో నెమ్మదిగా మాట్లాడుతాడు)

వివే:—వాసంతీ !

వా:—ఆఁ.

వివే:—నీకు తక్కిన వాళ్ళతో కలసి కూర్చోటం యిష్టంగా లేదా ?

వా:—నేను కాఫీ తెస్తూ చూచాను. వాళ్ళు నన్నుగూర్చి ఏవో గుసగుసలు చేసుకుంటున్నారు.

వివే:—నీకు అభిమానం మెండు.

వా:—అవును.

వివే:—ఎందుకో !

వా:—అది నా సహజగుణము.

వివే:—దాన్ని మార్చుకోలేవా !

వా:—అహఁ.

వివే:—ఎందుకనో !

వా:—నేను 'మలినజాతి'కి చెందినదాన్ని కనుక.

వివే:—అని ఎవరన్నారు ?

వా:—ఎవరు అనలేదు. వారెప్పుడు అలా అనరు—ఎందుకనరు ? నన్ను చూడగానే వాళ్ళ ముఖాలు మారుతూ వుంటై. చేతనైతే నన్ను ముక్కలు-ముక్కలుచేసి పారేద్దామన్నంతగా-ఓహో! యీ 'జాలి గుండె'లంటె నాకు వొళ్లుమంట ఎత్తుతుంది.

వివే:—వాసంతీ ! నీకు యిక్కడ వుండటం బాధాకరంగా వున్నదని నాకు తెలుసు. కాని—

వా:—అవును. నేను దూరంగా వెళ్ళిపోతే హాయిగా జీవించగలను. ఇలాంటి జనం మధ్య వుండడంకంటె—

వివే:—అంటే ?

వా:—అంటే యీ నిష్టపరులు, ధర్మపరుల మధ్య—

వివే:—వాసంతీ! నీ అభిప్రాయం—

వా:—నా అభిప్రాయం యేంటో నీకు తెలుసు. మీనాక్షి, సరోజినీలు రోజూ యిక్కడికి తామెంత గౌరవ, మర్యాదస్థులో నాకు చూపటానికి వస్తూ వుంటారు. నేనంత గౌరవ, మర్యాదస్థురాలినిగా వుండజాలను. అసలు అలా వుండటానికి నాకు యిష్టంకూడాలేదు.—నేను యిక్కడినుంచి వెళ్ళగలిగితే—ఎందుకైనా పనికిరాగలను.

వివే:—నీవు యిక్కడ వుండటమే మంచిది వాసంతీ !

వా:—దానివల్ల నాకు ప్రయోజన మేంటి ?

వివే:—నీవు వెళ్ళి పోవాల్నుకోటం గట్టిగా అన్న మాటలేనా ?

వా:—నీవు లేకపోయి నట్లయితే నేను యిక్కడ ఒకరోజుకూడా వుండను.

వివే:—నిజంగానా వాసంతీ ? నేనంటే నీకు అంత యిష్టమా ?

వా:—అవును. నీ ఉపదేశాలు నాకు చాలా ఆనందాన్ని కలిగిస్తూవుంటవి.

వివే:—వాసంతీ ! నిన్నుగూర్చి నేను యెప్పుడూ ఆలోచిస్తూ వుంటాను.

వా:—అంతేనా ?

వివే:—నీ కంటె మించి నాకు దగ్గరవారు లేరంటే నమ్ము.

వా:—నేనే గనక మీనాక్షీ, లేక సరోజినీ నయితే నీవు నాతోబహిరంగంగా, యితరుల సమక్షంలో మాట్లాడటానికి భయపడే వాడివికాదు.

వివే:—వాసంతీ ! నేను ఎన్ని సమస్యలు యెదుర్కోపలసి వస్తుందో నీకు తెలియదు. సంఘంలో ఒకవ్యక్తి నాయకుడుగా, మార్గదర్శిగా వున్నప్పుడు జాగ్రత్తగా వుండటం మంచిది. ప్రజానీకం సరిగ్గా అర్థంచేసుకోగలిగితే—అయినా ఫరవాలేదు. నీకు నేనెప్పుడూ సహాయ భూతునిగానే వుంటాను.—వాసంతీ ! పరిస్థితు లనుకూలించి నప్పుడు నేను నిన్ను కావాలని కోరితే నీవు నా భార్యగా వుండటానికి అంగీకరిస్తావా? నాకు మాట యివ్వు.

వా:—ఆc.

వివే:—సంతోషం! సంతోషం! వాసంతీ! నేను నిన్ను ఎంతో ప్రేమిస్తున్నాను—హుష్! ఎవరో వస్తున్నట్లున్నది—వాసంతీ!—నాకోసం—బయటికి వాళ్ళ దగ్గరికి వెళ్ళు.

(వాసంతి బయటవున్న స్త్రీల దగ్గరకు వెళ్ళుతుంది. ప్రక్కగదిలోనుంచి చేతిలో ఒక కాగితాలకట్ట పట్టుకొని రాజారామ్, అతనివెంట విశ్వేశ్వరరావు, గుణచంద్, కృష్ణపిళ్ళె వస్తారు.)

రాజా:—సరే! ఈ విషయం తేలిపోయినట్లే.

గుణ:—ఆc. తేలిపోయినట్లే.

విశ్వే:—ఒక నిశ్చయాని కొచ్చిన తరువాత అది జరిగి తీరవలసిందే.

రాజా:—మనకు వ్యతిరేకం వుంటుంది- దాన్ని మనం యెదుర్కోవాలి. జయించాలి.

విశ్వే:—మనం ఒక కట్టుగా నిలబడాలి. జయించినా, వీగిపోయినా—

జగ:—(వరండాలోనుంచి లోపలికివస్తూ) రైల్వే స్కీమేనా-వీగిపోవటం-

రాజా:—కాదు. రైల్వేస్కీము ప్రవేశపెట్ట బోతున్నాం.

జగ:—నిజంగానా?

వివే:—ఏమిటీ?

కమ:—(వరండాలోనే గది వాకిలి దగ్గర నిలబడి) ఏమిటండీ? —

రాజా:—ఆc. దీన్నిగూర్చి నీకు తరువాత చెప్పుతాను. (తోటి వ్యాపారస్థులతో) మనం చందాదారుల జాబితా తయారు చేయాలి. ఇది యెంత త్వరగా జరిగితే అంతమంచిది. మన నలుగురి పేర్లు పైన కనబడాలి. సంఘంలో మనం పొందియున్న స్థానాన్నిబట్టి ఇందులో మనం తగినంత బాధ్యత వహించవలసి వుంటుంది.

కృష్ణ:—తప్పని సరిగా.

కమ:—ఏమండీ? కాస్త బయటికివచ్చి అసలు విషయం చెప్పేదురు.

రాజా:—కమలా! ఇది ఆడవాళ్ళకు సంబంధించిన విషయంకాదు.

జగ:—అయితే మీరు నిజంగా రైల్వేస్కీమును బలపరుస్తున్నారన్నమాట.

రాజా:—అవును. నిజంగా.

వివే.—గతసంవత్సరం మీరు—

రాజా:—అప్పటి స్కీముచేరు. అప్పుడు రైల్వే సముద్రపు అంచునే—

గుణ:—అది కేవలం అనవసరం వివేకానందంగారూ. మన స్టీముబోట్ సర్వీసు వుండనే వున్నది.

కృష్ణ:—వృథాగా ఖర్చు పెట్టవలసి వచ్చేది.

రాజా:—అసలు విషయం—దానివల్ల మన టవున్‌ప్రజలకు ఏమీ వుపయోగం వుండేదికాదు. అందుకని దాన్ని నేను ప్రతిఘటించాను. ఇప్పుడు చాలా దూరంగా యీ లైను వెళ్ళుతుంది.

జగ:—అయితే మీస్కీము ప్రకారం రైల్వే మన టవున్ మీదుగా రాదుగా.

రాజా:—వస్తుంది జగదీశ్! ఆ లైనునుంచి యిక్కడికి ఒక బ్రాంచిలైను వేయబోతున్నాము.

జగ:—ఓహెూ! ఇది కొత్తస్కీము అన్నమాట.

విశ్వే:—అవును. చాలా పెద్దస్కీములే.

వివే:—నిజంగా మీరు ఇంత పెద్దస్కీము ఆలోచిస్తున్నారా ?

రాజా:—అవును. ఇది దైవసంకల్పమనే చెప్పాలి. లేకపోతే నేనుఇలాంటి పెద్దస్కీమును చేపట్టను.

కమ:—మీరు యింతపెద్ద కార్యభారాన్ని రహస్యంగా వుంచటంలో అర్థం?

రాజా:—కమలా! నీకు చెప్పినా అసలు సంగతి అర్థం అయ్యేదికాదు— అసలు నేనింతవరకు యీరహస్యాన్ని యేప్రాణికి చెప్పలేదు. ఇప్పుడు అవసరం వచ్చింది కనుక చెప్పుతున్నాను. నా శక్తికొలది యీకార్యం సఫలీకృతం కావటానికి ప్రయత్నిస్తాను.

విశ్వే:—మేము మీకు అన్నివిధాలా అండగా వుంటాము.

రాజా:—ఈ స్కీమువల్ల మన సంఘం ఎంత ముందుకు పోగల్గుతుందో ఆలోచించండి. చుట్టూవున్న అడవి ప్రదేశాలన్నీ వాసయోగ్యం అవుతై. భూగర్భంలోవున్న ఖనిజసంపదనంతా బయటికి లాగుతాము. సముద్రంలో కలిసే నదుల నీటినంతా ఆపివేస్తాము. ఇంకా—ఇంకా——

వివే:—తక్కిన ప్రపంచంతో సంబంధం కలుస్తున్నందుకు మీరు భయపడరు ?

రాజా:—లేదు. మాయీచిన్న పరిశ్రమలకు దెబ్బతగులు తుందేమోననే భయం లేదు. సంఘసేవకోసం వీటినియింకా పెంచటమే మాబాధ్యత. మా ఆడవాళ్ళు—మీరంతా వినవలసివున్నది. ముందుకురండి—మా ఆడవాళ్ళు—మా భార్యలు, మా పిల్లలు దాన ధర్మాలుచేస్తూ ప్రశాంత జీవితాన్ని గడుపుతూ వుంటారు—మరచి పొయ్యాను. కమలా ! రాంబాబు ఎక్కడా ?

కమ:—సెలవు వచ్చిందంటే వాణ్ణి యింట్లో ఆపడం బ్రహ్మతరంకాదు.

రాజా:—వాడు సముద్రం వొడ్డుకు వెళ్ళివుంటాడు. యేదో వొక విపత్తు తీసుకొనిగాని రాడు.

విశ్వే:—మీరు మీకుటుంబాన్ని గురించి యెంత జాగ్రత్తగా వుంటారు ?

రాజా:—సంఘానికి కుటుంబం మూలాధారం. మంచియిల్లు, నమ్మకం—గౌరవంగల మిత్రులు, ఆనందంతో వుప్పొంగే కుటుంబం—

(నటేశం ఉత్తరాలు, కాగితాలు తీసుకొని వస్తాడు)

నటే:—బాబూ ! న్యూయార్కునుంచి టెలిగ్రామ్ వచ్చింది.

రాజా:—(తీసుకుంటూ) ఓహో ! "ఇండియన్ గరల్" ప్రొప్రయిటర్ల దగ్గరనుంచి.

(విశ్వేశ్వరరావు, గుణచంద్, కృష్ణపిళ్ళై ఒకర వెంటవొకరు వెళ్ళటానికి సిద్ధపడతారు.)

రాజా:—వెళ్ళుతున్నారా ! మంచిది—మరచిపోకండి. మళ్ళం తిరిగి ఐదు గంటలకు కలుసుకోవాలి. (వారు ముగ్గురు వెళ్ళిపోతారు)

రాజా:—(టెలిగ్రామ్ చదివి) ఇది ఫక్తు అమెరికా వాళ్ళు వ్రాసినట్లే వున్నది ఓహో !

కమ:—ఏమిటా టెలిగ్రాం ?

రాజా:—(టెలిగ్రాం చదువుతాడు) "అపసరముష్నంతపరకే రిపైర్సు చేయించండి. అర్జంటు. త్వరగా పంపించాలి." సరే—

విశే:—పాశ్చాత్య జాతుల్లో యీ వేదన అప్పుడేపోదు.

జగ:—ఇదుగో! నేను ఎడారిమధ్య మిట్ట మధ్యాహ్నం వెళ్ళుతూ ప్రక్కనే బావి కనపడితేకూడా అలా—వుష్! ఆమోత నాచెవిలో గింగురు మంటున్నది.

వివే:—పోలీసులు కల్పించుకోటం అవసరం.

రాజా:—ఓహ్! పరదేశీయుల్ని మనం అంత నిర్దాక్షిణ్యంగా చూడగూడదు. పాపం? వాళ్ళు మనలో పాతుకుపోయిన గౌరవ, మర్యాదలు పాటించరు. అయినా దానివల్ల మనకేంనష్టం? అదృష్టవశాత్తుమనం అలాంటి సంఘంనుంచి దూరంగా—ఎవరు?

(శోభాదేవి గబగబా లోపలికి వస్తుంది.)

ఆడవాళ్ళు:—(చిన్న గొంతుతో - గాభరాగా) సర్కసుమనిషి! మేనేజరు పెళ్ళాం !

కమ:—ఏమిటి గొడవ ?

వన:—(ముందుకువచ్చి) ఓహ్—!

శోభా:—కమలా! బాగున్నావా? వనకుమారి! క్షేమమా? బావా! కులాసాయేనా?

కమ:—(పెద్దగాఅరుస్తూ) శోభా—!

రాజా:—(వెనక్కు తగ్గుతూ) అఁ. నిజంగా—

శకుం:—దేవుడి దయవుంటే—!

సులో:—ఆమె కాకపోవచ్చు—!

జగ:—వుష్!

కమ:—శోభా—! నిజంగా—!

శోభా:—నిజంగానేనే! పడిపోతావు. నన్ను అనుకో కమలా!

జగ:—వుష్—! వుష్—!

కమ:—తిరిగి యీవిధంగా రావటం—?

శకుం:—అంటే యీవిధంగా కనపడటం—?

శోభా:—కనపడటమా? అంటే ఎలాకనబడటం?

రాజా:—అంటే—సర్కసులో—

శోభా:—అదా! (నవ్వుతూ) బావా! నీవు పిచ్చివాడిలాగా వున్నావే? నేను సర్కసులో వున్నానని యెలా అనుకున్నావు?

రాజా:—అయితే మరి నీవు సర్కసువాళ్ళతో కలిసి—

శోభా:—మేము వాళ్ళతోకలిసి ఒకే తరగతిలో - మూడోతరగతిలో ప్రయాణం చేసాము.

కమ:—'మేము' అంటే?

శోభా:—అంటేనా। నేను - నాబిడ్డ.

అడ:—:(పెద్దగా) బిడ్డకూడానా ?

కమ:—శోభా! నీవనేది ఏంటి?

శోభా:—నాబిడ్డ అంటే బాబు, నాకు తెలిసినంతవరకు మరోబిడ్డలేడు· బాబు - మీరు బాబురావు అని పిలిచేవాళ్ళే. అతడుతప్ప—

సులో:—(మెల్లిగా జ్ఞానాంబతో) వాడే! ఆదుర్మార్గుడు—!

రాజా:—బాబూరావు నీతోవున్నాడా ?

శోభా:—ఆఁ. అతడు లేకుండా నేనెలావస్తాను?—ఏం అలా బిక్కమొగం వేసుకొని చూస్తున్నావు?—ఎందుకలా చీకట్లో కూర్చొని కుట్టుపని చేసుకుంటున్నావు?—ఎవరైన చావలేదుకదా?

వివే: —శోభాదేవిగారూ—! మీరు దురదృష్టవశాత్తు పతిత సంఘంలో—

శోభా:—(తనలోతాను) వీరంతా ఎవరు? బహుశ—

సులో:—నిజంగా—!

శోభా:—ఓహో! తెలుసుకున్నాను. ఆమె సులోచనాదేవి— ఈమె శకుంతలాదేవి. ఓహో! సరే మంచిది! మీరంతా వినండి. పతిత స్త్రీ లెవరో తరువాత తెలుసుకోవచ్చు. ఇలాంటి ఆనంద సమయంలో—

వివే:—ఇంటికి తిరిగిరావటం ఆనందసమయంకాదు.

శోభా:—నిజంగానా? 'శాస్త్రి'గారూ? మీ వేదపఠన బాగావున్నదా?

వివే:—నేను శాస్త్రినికాను.

శోభా:—కాకపోతే ముందుతప్పకుండా అవుతారు. ఓహో! యీ మీఘోషా నాకు తలనొప్పిగా వున్నది. నేను బయట గాలికిబ్రతకటం అలవాటు పడ్డాను.

రాజా:—(నొసలు తుడుచుకుంటూ) ఇక్కడ కొంచెం వుక్కగానేవున్నది.

శోభా:—కొంచెం గాలివస్తుంది. (కర్టెన్సు తొలగిస్తూ) ఎంత వెలుతురొచ్చి నదో చూడండి. నాబిడ్డ వచ్చేటప్పటికి యిక్కడబాగా వెలుతురుండాలి. ఓహ్! అడుగో! అక్కడ ముఖంకడుక్కునే పిల్లవాన్ని చూశారుగదూ?

జగ:—వుష్!

శోభా:—ఓడలో వొళ్లంతా మసికొట్టుకుంది.

జగ:—వుష్! వుష్!

శోభా:—వుష్! ( జగదీశ్వంక వేలు చూపుతూ తక్కినవాళ్ళతో ) వీడు యీ 'వుష్' అంటూనే . యింకా యిక్కడ అడుక్కుతింటూ వున్నాడా ?

జగ:—వుష్! నేను అడుక్కుతింటానికి యిక్కడకు రాలేదు. నా ఆరోగ్యం కోసం యిక్కడ వుండవలసివచ్చింది.

శోభా:—(రాంబాబును చూచి) చెల్లీ! నీకొడుకేనా? చిట్టీ! రా! నా యీ తరహా చూచి భయపడుతున్నావా ? .

వివే:— (పుస్తకం చేతులోపట్టుకొని ఆడవాళ్ళను సంబోధించి) ఏమండీ యివాళ మనకు వేరే పనిలేదనుకుంటాను. షుళ్ళీ షుసం రేపు సమావేశం కావాలిగదూ ?

(అందరూ లేచి బయటికి వెళ్ళటానికి సిద్ధంగా ఉంటారు)

శోభా:— మంచిది. నేనుకూడా మిమ్మల్ని మీటింగులో కలుసుకుంటాను.

వివే:—మీరా ? క్షమించండి శోభాదేవిగారూ ? మీరు 'మా సంఘం'లో ఏం చేయాలనుకుంటున్నారు ?

శోభా:—శాస్త్రిగారూ ! మీ సంఘంలో కొంచెం మంచిగాలి వచ్చే ఏర్పాటు చేసాను.

# రెండో అంకం

(అదేగది, కమలాదేవి ఒంటరిగాకూర్చొని కుట్టుపనిచేస్తూ వుంటుంది. రాజా రావు బయటనుంచి వస్తాడు. ఒక చేతిలోకఱ్ఱ, రెండోచేతిలో హేట్ వుంటవి.)

కమః—అప్పుడే తిరిగివచ్చారే ?

రాజాః—ఆc. ఒకమనిషి యిప్పుడు నాకోసంవస్తాడు.

కమః—ఆc. మరచిపొయ్యాను, బాబురావు మళ్ళీవస్తానని అన్నాడే ?

రాజాః— 'ఒకమనిషి' అనిచెప్పాను (హేట్ బల్లమీదపెట్టుతూ). ఇవాళ ఎవరూ ఆడవాళ్ళులేరే ?

కమః—సులోచనాదేవికి యివాళ తీరికలేదట.

రాజాః— తక్కినవాళ్ళో ?

కమః—వాళ్ళకూ ఏవో పనులున్నవట.

రాజాః—ఎందుకురాలేదో నాకుతెలుసు—రాంబాబు ఏడీ ?

కమః—ఇప్పుడే కాసేపు బయట తిరిగిరమ్మని వాసంతిని తోడుపంపాను.

రాజాః—వాసంతితోనా ?—వొట్టి వెకిలిపిల్ల—నిన్నచూడు ! బాబురావుతో ఎంత పరిచయస్తురాలల్లే మాట్లాడిందో ?

కమః—వాసంతికి మర్మం తెలియదు.

రాజాః—కావచ్చు. కానిబాబురావు ఆపిల్లకు అంత చనువుయివ్వకూడదు. నిన్నటి వాళ్ళప్రవర్తన నాకు చాలా అసభ్యంగా కనబడింది.

కమః—(కుట్టుపనిఆపి) బాబురావు మళ్ళీ యిక్కడకురావటంలో వుద్దేశమేంటో మీరు వూహించారా ?

రాజాః—ఆ. అక్కడ అతను వ్యవసాయంసాగించాడు. కాని దానివల్ల యేమీ గిట్టుబాటువున్నట్లు కనబడటంలేదు—నిన్న 'ఆమె' మాటల్లోనే కనబడింది-వాళ్ళు రెండోతరగతిలోప్రయాణం చేయువలసివచ్చిందట-

కమః—బహుశాఅలాంటిదేకావచ్చు. కాని తిర్గి శోభవాణ్ణి వెంబడించటం?

రాజాః—పాతచరిత్ర మళ్ళీ బయటకు లాగబోకు.

కమః—అనుకున్నా చేసేదేముంది? వాడునాకు తోడబుట్టినవాడు. ఐనా వాడివల్లనే నేను తల వంచుకోవలసివస్తుంది. మీకు ఎలాంటి అప

వాడువస్తుందోనని లోపల, లోపల కుమిలిపోతున్నా.—ఎందుకో వాడు వచ్చినదగ్గరనుంచి భయంవేస్తుంది.

రాజా:—భయమా! ఎందుకు ?

కమ:—(విచారంతో) వాడు మీతల్లిదగ్గర ధనం అపహరించాడుకదూ !- ఎవరైనా కేసుపెట్టి వాణ్ని జైలుకు—

రాజా:—ఛీ! కేసుపెట్టేదెవరు?—అసలువాడు దొంగిలించాడని రుజువు చేసేదెవరు ?

కమ:—మొత్తం టవునంతాతెలుసు.—మీనోటితోమీరే—

రాజా:—నేనేమీచెప్పలేదు. అది కేవలం టూకీగా అనుకోవటంతప్ప యెవరికీ యేమీ తెలియదు.

కమ:—మీరు నిజంగా దేవతామూర్తులు.

రాజా:—ఇక అవిషయాలేమీ ఎత్తబోకు. వాటిని గుర్తుకుతెస్తూ నీవు నన్నెలా బాధిస్తున్నావో నీకు తెలియటంలేదు. (ముందుకు-వెనక్కు నడుస్తూవుంటాడు. చేతికర్ర టేబిల్‌కుఆనిస్తాడు) వాళ్ళు తిరిగి రావటంలో—ముఖ్యంగానేను అన్నివిషయాల్లోనూ ప్రజానీకానికి, పత్రికలకు అదర్శప్రాయంగా కనపడవలసిన యీసమయంలో— నీలాగా వాళ్ళుకూడా వెనకటి గాథలన్నీత్రవ్వి బయటికి లాగుతారు—మనలాంటి కుటుంబములో—నా అంతరంగికుడు, నాకు సహాయభూతుడనుకున్నవ్యక్తి వొక్కడూ నాకు కనబడటంలేదు.

కమ:—ఒక్కడుకూడా ?

రాజా:—లేడు. ఒక్కడుకూడాలేడు. యిలాంటిసమయంలో వాళ్లుయిక్కడకురావటం ?—సందేహంలేదు. వాళ్లు ముఖ్యంగా ఆమె యేదోవొక అపద మననెత్తిమీద పెట్టకమానదు. అసలు అలాంటివాళ్ళతో సంబంధం పెట్టుకోటమే ఆపదల్ని కొనుక్కోట మవుతుంది.

కమ:—వాళ్ళు అలాంటిపనులు చేస్తారని—

రాజా:—అవును. నీకు చుట్టాలని—నేనుచెప్పింది అక్షరాలానిజం.

కమ:—నేను వాళ్ళను తిరిగి రమ్మనలేదు.

రాజా:—వరుసకానీ—'నేను రమ్మనలేదు. నేను రమ్మని వ్రాయలేదు. నేనురమ్మని వాళ్ళను జుట్టుపట్టుకొని లాక్కొనిరాలేదు—' ఇంకా- నాకు అన్నీతెలుసు.

కమ:—(కన్నీరుకారుస్తూ) మీరు యింత నిర్దాక్షిణ్యంగా మాట్లాడతారని-

రాజా:—పెద్దగాఏడ్వు. చుట్టుప్రక్కలవాళ్ళు వినటంవొకటే ఇకతక్కువ- నోరు మూసుకొని దూరంగా కూర్చోటంమంచిది. ఎవరైనావచ్చిచూస్తే - అదిగో ఎవరోవస్తున్నట్లుంది. (మెల్లిగా) వెళ్ళు, లేచివెళ్ళు—(తలుపు కొట్టినమోత) ఎవరు ? లోపలికిరా ?

(కమలాదేవి అల్లికవస్తువుల్ని తీసుకొని నెమ్మదిగా తోటవైపుకి వెళ్లుతుంది. శ్యామలరావు వస్తాడు.)

శ్యామ:—నమస్కారం ! బాబూ !

రాజా:—ఆఁ. ఎందుకు కబురంపానో వూహించివుంటావు.

శ్యామ:—ఆఁ. నిన్న నటేశంగారుచెప్పారు. మీకుచాలా అసంతృప్తిగా—

రాజా:—అవును. నీ మేనేజ్‌మెంటు బొత్తిగా బాగాలేదు. — అనుకున్న ప్రకారం పని సాగటంలేదు. 'పామ్ట్రీ' ఎప్పుడో పూర్తిఅయి సముద్రంలోకి వెళ్ళవలసింది. గుణచంద్‌వచ్చి గోలపెట్టనిరోజులేదు.

శ్యామ:—'పామ్ట్రీ'ని రేపుకాక యెల్లుండి వదలవచ్చు.

రాజా:—ఎంతకాలానికి ? మరి ఐదువారాలనుంచి పడివున్న అమెరికా ఓడ 'ఇండియన్ గరల్' సంగతి ?

శ్యామ:—మన స్వంతఓడపని పూర్తికావలసి వున్నది.

రాజా:—అది నాకుతెలుసు. కాని 'ఇండియన్ గరల్' కూడా త్వరగా పూర్తిచేయాలి. అవునా ?

శ్యామ:—దానికి అడుగుభాగమంతా చెడిపోయిందిబాబూ. ఒకప్రక్క అతుకులు వేస్తుంటే రెండోప్రక్క వూడిపోతూవుంది.

రాజా:—అసలు కారణం నటేశం చెప్పాడు. నేను తెప్పించిన క్రొత్త యంత్రాన్ని మీకు ఉపయోగించటం చేతకాలేదు. కనీసం దాంతో చేయటానికి మీరు ప్రయత్నించటంకూడా లేదట.

శ్యామ:—బాబూ! నా చిన్నతనంనుంచీ నేను పాతపద్ధతిలోనే పనిచేస్తూ వచ్చాను.

రాజా:—ఇక అపద్ధతి పనికిరాదు. కొత్తయంత్రాలతో, కొత్తపద్ధతిలో పని చేయటం నేర్చుకోవాలి. నేనిలా అంటున్నానంటే ఇంకా యెక్కువ లాభాలు తీద్దామనికాదు. అదృష్టవశాత్తు అస్తిలో నాకులోటులేదు. కానినేను సంఘానికి, కొంత బాధ్యత వహించవలసి వున్నది. సంఘ శ్రేయస్సుకు నేను మార్గదర్శకుణ్ని కావాలి.

శ్యామ:—నేను కోరేదికూడా సంఘశ్రేయస్సే.

రాజా:—కాని నీవుకోరే సంఘశ్రేయస్సు చాలా సంకుచితమైనది—అంటే కేవలం నీవు నీవర్గాన్నే దృష్టిలో పెట్టుకుంటున్నావు. నీవు పెద్ద పెద్ద వుపన్యాసాలిస్తావు. ప్రజల్ని ఆవేశపరుస్తావు. సంఘటిత పరుస్తావు. అదంతా నాకుతెలుసు.—కాని శ్రేయస్సుకు ఒకప్రత్యేకమైన కార్య భారం పూనవలసివస్తే—అంటే ప్రస్తుతం నేనుతెచ్చిన క్రొత్త యంత్రానితో పని చేయవలసివస్తే నీవు చేయటానికి భయపడతావు.

శ్యామ:—అవును. నిజంగా భయపడవలసిన విషయమేబాబూ! ఈ యంత్రాలవల్ల యెంతమంది నోటిదగ్గరకూడు పోతుందో చూస్తే నాకు భయంవేస్తుంది. మనం సంఘాభివృద్ధికి చాలా బాధ్యత వహించాలని మీరు ఏవేవో పెద్ద పెద్ద నీతులు చెప్పుతున్నారు. కాని సంఘానికి కూడా కొన్ని బాధ్యతలు వున్నవని నా అభిప్రాయం. కార్మికుల్లో నూతన యంత్రాల్ని ఉపయోగించగల విద్య, విజ్ఞానం పెంపొందించకుండా యిలాంటియంత్రాల్ని ధనికవర్గం ప్రవేశపెట్టటంలో అర్ధంయేటి?

రాజా:—మీరు కేవలం ఆలోచిస్తూవుంటారు. అందుకనే అంతా మీకు అసంతృప్తిగా కనపడుతుంది.

శ్యామ:—అదికాదుబాబూ! ఈ యంత్రాల మూలకంగా ఒకొక్కళ్లనే ఉద్యోగంలోనుంచి తీసివేయటం నేను చూడలేను.

రాజా:—శ్యామలరావూ! నీతోవాదించటానికి నేను నిన్ను పిలిపించలేదు. 'ఇండియన్ గరల్' కూడా యెల్లుండే సముద్రంలో ప్రయాణం చేయ

టానికి సిద్ధపరచాలని చెప్పటానికే నిన్నుపిలిచాను. తెలుసా ?
శ్యామ:—బాబూ !
రాజా:—ఎల్లుండి ! విన్నావా ? అప్పుడే మనఓడకూడా ! ఒక్కగంట కూడా ఆలస్యం కాగూడదు. నీకు తెలుసా ? ఈ పత్రికలవాళ్ళుమనం కేవలం వొక్క 'పామ్ట్రీ'నే బాగుచేస్తూవున్నామని గోలపెట్టుతూ యిష్టంవచ్చినట్లు దుమ్మెత్తిపోస్తున్నారు. మార్గదర్శకుణ్ణనుకునే నేనే యిలాంటి విమర్శనలకు గురిఅయితే ఇక యితరులమాట యేంటి ? ఒకరు వేలుపెట్టి చూపించటం నేను భరించలేను.
శ్యామ:—యెల్లుండికి పూర్తికావటం అసంభవం.
రాజా:—ఆఁ. సరే మరెవరినైనా చూసుకుంటా.
శ్యామ:—అంటే ! మీరు మమ్మల్ని ఉద్యోగంనుంచి—
రాజా:—అవును. ఎల్లుండికి 'ఇండియన్‌గరల్' పూర్తికాకపోతే నీ వుద్యోగం రద్దుఅవుతుంది.
శ్యామ:—నిజంగానా ?
రాజా:—ఆఁ. నిజంగా, ముమ్మాటికీ నిజం.
శ్యామ:—బాబూ ! ఇదంతా మీరు సంఘంకోసం, సంఘశ్రేయస్సుకోసం చేస్తున్నారుకదూ ? నాకూ ఒకచిన్నసంఘం వున్నది. నాకూ భార్యా, బిడ్డలూవున్నారు. వారే నాసంఘం. వారిని రక్షించవలసిన బాధ్యత, పెంచి పెద్దచేయవలసిన బాధ్యత నామీదవున్నది. వారు నామీద, నా కష్టంమీద, నావుద్యోగంమీద ఆధారపడివున్నారు. — మీరు నన్ను వుద్యోగంనుంచి తీసివేస్తే నాయీ సంఘం ఛిన్నా భిన్నమైపోతుంది. ముక్కలు ముక్కలుగా చీలి ధ్వంసమవుతుంది.
రాజా:—గత్యంతరంలేనప్పుడు పెద్దదానిముందు చిన్నది నాశనం కావలసిందే. సమిష్టి అభివృద్ధికి వ్యష్టినాశనం అంగీకరింపక తప్పదు. ఇంతకంటే నేనిచ్చే సమాధానంలేదు. ప్రపంచంలో యెక్కడకూడాలేదు నిన్ను వదలిపెట్టటం నాకు విచారంగానేవున్నది. కాని
శ్యామ:—నన్ను వదలిపెట్ట నక్కర్లేదు.
రాజా:—అంటే !

శ్యామ;—అంటే నాబోటి సాధారణవ్యక్తికిగూడ కొంతబాధ్యత వుందని గుర్తిస్తున్నాను.

రాజా:—అవును. అవును. నీవు పూర్తి చేయగలవని విశ్వాసం—

శ్యామ:—'ఇండియన్ గరల్' ఎల్లుండి తప్పక ప్రయాణంచేస్తుంది. (నమస్కరించి వెళ్ళిపోతాడు.)

రాజా:—కాదన్న అతన్ని ఒప్పించాను. ఇది వొక శుభసూచకమే.

(జగదీశ్ తోటలోగుండా నోట్లోచుట్టపీలుస్తూ వస్తాడు. కమలాదేవికూడా వస్తుంది.)

జగ:—(వరండాలోకివస్తూ) గుడ్‌మార్నింగ్ !

రాజా:—గుడ్‌మార్నింగ్ !

జగ:—నీవు పెద్దగా అరుస్తున్నట్లుంది. చూస్తేనీకుకూడా తెలిసినట్లుంది.

రాజా:—నాకా ! ఏంటి ?

జగ:—టవునంతా పాక్కిపోయింది. వుష్ !

రాజా:—ఆఁ. ఏంటీ ?

జగ:—(గదిలోకివస్తు) ఏంటేంటి. మన అమెరికావాళ్ళు వాసంతినివెంట వేసుకుని బజార్లల్లో తిరుగుతున్నారు.

కమ:—(అతనివెంట లోపలికివస్తూ) ఆఁ. నిజమేనా !

జగ:—నిజమే. ముమ్మాటికినిజం. శోభా ఒకచోట నన్నుచూచి కేక వేసిందికూడాను. నేను విననట్టు తప్పించుకువచ్చాను.

రాజా:—ఇందులో అబద్ధం ఏముంటుంది ?

జగ:—వచ్చేపోయేజనం వాళ్ళనువిడ్డూరంగా చూడసాగింది. ప్రతియింట్లోను వూరేగింపు చూట్టానికన్నట్లు జనంతెరలసందుగా కిటికీల్లోనుంచి చూచారంటే యిక యేంచెప్పాలి. వుష్ ! —ఓ ! నావొల్లు కంపరం యెత్తిపోతుంది. ఇలాఅయితే నేనిక్కడ వుండలేను.

కమ:—వాడితో నీవుమాట్లాడి—

జగ:—బజార్లో ! పట్టపగలే ! అది నావల్ల కానిపని. వాడు తిరిగి మళ్ళీ నడిబజారులో తల యెత్తగలిగాడంటే యేమనుకోవాలి. వాణ్ని ఆపగలిగేది ఆ పత్రికలవాళ్ళే. వుష్ !

రాజా:—పత్రికలా ? ఏమైనా వ్రాసినవా ?

జగ:—ఎలా వూరుకుంటై ! నాకు మనస్సులో కలతవుంటంచేత నిన్న యేమితోచక క్లబ్ కువెళ్ళాను. నన్నుచూచి అంతకుముందు మాట లాడుకుంటూవున్న వాళ్ళంతా గప్‌న ఆపివేశారు, మనవాళ్ళ సంగతే. ఇంకేముంటుంది. తరువాత కాసేపటికి పత్రికావిలేఖరి వెంకటేశం గాడు నాదగ్గరకు తీరిగ్గావచ్చి 'భాగ్యవంతుడయిన మీ పినతల్లికొడుకు తిరిగి వచ్చినందుకు ధన్యవాదాలోయ్' అని గొంతు చివరస్థాయిలో అంటూ చేతులెత్తాడు,

రాజా:—భాగ్యవంతుడా !

జగ:—అతగాడన్న మాటలవి. కాని నేనువూరుకున్నానా. వాణ్ని ఎగా దిగాచూసి ఆసంగతి నాకేమీ తెలియదన్నట్లుగా అభినయించాను. అప్పటికీ వొదలిపెట్టలేదు.—'అమెరికా వెళ్ళేవాడు వూరికే వొట్టిచేతు లతో వెళతాడటోయ్' అని కన్నెగరేస్తు అన్నాడు. వుష్ ! అదిగో వస్తున్నారు.

రాజా:—(బజారువంకచూస్తూ) అరే ! రాంబాబుకూడా వాళ్ళవెంటే వున్నాడే.

జగ:—ఎందుకుండడూ ! టవున్‌లో అందరికంటే మర్యాదగావున్న కుటుంబానికి చెందినవాళ్ళమని జనానికి తెలియపరచాలని వాళ్ళ వూహ—అదుగోచూడు. ఆకొట్లోనుంచి జనం బయటకివచ్చి వాళ్ళ నెలా చూస్తున్నారో. చూట్టమేకాదు, తిట్టిపోస్తారుకూడాను. నేనిక్కడ కూర్చోలేను. వుష్ !

రాజా:—వాళ్ళు ఇక్కడికేవస్తున్నారు. ఇదిగో కమలా ! వాళ్ళను నీవు చాలా ఆప్యాయనంగా, గౌరవంగా అహ్వానించాలి. జాగ్రత ! నీవుకూడ అంతే జగదీశ్ !

జగ:—నేనా !

రాజా:—అం. వాళ్ళు యిక్కడ ఎక్కువకాలం వుండరు. కాబట్టివాళ్ళ మనస్సుల్ని ఏవిధంగా బాధించటం మంచిది కాదు. అవునా !

కమ:—మీరెంత ఉదాత్తపురుషులు ?

జగ:—వుష్ !

(బాబురావు, వాసంతి ముందువస్తారు. వారివెంట శోభాదేవి, రాంబాబు వస్తారు.)

శోభా:—గుడ్‌మార్నింగ్ !

బాబూ:—రాజా ! మేము ఒకసారి టవునంతా చూసివచ్చాము.

రాజా:—విన్నా. అప్పటికీ ఇప్పటికీ చాలా మారిపోయింది.

శోభా:—ఎక్కడచూచినా రాజారావుగారి ధర్మస్థలాలూ, భవనాలు—నీవు దానంచేసిన 'రిక్రియేషన్‌గ్రౌండు' కూడా చూచివచ్చాము.

రాజా:—అంతదూరం వెళ్ళివచ్చారూ !

శోభా:—'శ్రీ, శ్రీ రాజారావుగారి ధర్మం' అని గేటుమీద పెద్దఅక్షరాలుచెక్కి వున్నవి. మొత్తం యీటవును అభివృద్ధికి నీవేబాధ్యుడివిగా కనబడు తున్నావు.

బాబూ:—మీ ఓడల్నిచూస్తే కళ్ళు తిరిగినై. 'పామ్‌ట్రీ' కెప్టెన్—నా స్కూల్‌మేట్‌ను కలుసుకున్నాను.

శోభా:—కొత్తగా స్కూలుకి ఒకభవనంకూడా కట్టించావు. టవునంతటికీ నీటిసప్లయికీ, గ్యాస్ సప్లయికి నీవే కారకుడవని విన్నాను.

రాజా:—సంఘంలో జీవించినంతకాలం సంఘాభివృద్ధికి పాటుబడటం నావిధి.

శోభా:—బావా ! నీఅభిప్రాయం మెచ్చుకోదగ్గది. నిన్ను జనం యెలా కొనియాడుతుందో చూట్టం నాకేఆనందమేసింది. మేము మాట్లాడిన వాళ్ళతో మేము నీబంధువులమని చెప్పలేకుండా వుండలేక పోయామంటే నమ్ము.

జగ:—వుష్ !

శోభా:—వుష్ ! ప్రతిదానికి వుష్ !

జగ:—కాదు ! కాదు ! 'శుభం' అని చెప్పతున్నా.

శోభా:—నీవు వట్టి దద్దమ్మవు.—

జగ:—వుష్ ! (బయట వరండాలోకివెళ్ళుతాడు.)

శోభా:—వీడికేదైనా రోగమా ?

జగ;—వాణ్ని గురించి అంతగా ఆలోచించనక్కర్లేదు. అప్పుడప్పుడు వాడి నరాలు పటుత్వంతప్పి వొణుకుతూవుంటాడు. అంతే—తోట ఒకసారి చూచివద్దాంపద.

శోభా:—ఈ తోటలోనే మనం ఎన్నోసార్లు కలిసి తిరిగాముకదూ.

కమ:—అప్పటి తోటకాదిది. చాలా మారిపోయింది. వెళ్ళి చూద్దాంపద.

(రాజారావు, కమలా దేవి, శోభా దేవి తోటలోకి వెళ్ళుతారు.)

రాం:—(వరండాలోకివస్తూ) మామయ్యా! నన్ను చినమామయ్య 'అమెరికా వస్తావా' అని అడిగాడు.

జగ:—ఓరిమూర్ఖుడా! రానని చెప్పు.

రాం:—నేను వెళ్ళుతామామయ్యా! మరే అక్కడ భలె—భలే—

జగ:—ఛీ! నోరుముయ్యి.

(జగదీశ్ రాంబాబును తీసికొని తోటలోకి వెళ్ళుతాడు. వాసంతి యీ మధ్యలో తలుపుదగ్గిర నిలబడి దుస్తులు సుట్టిసులుపుకుంటూ వుంటుంది.)

బాబూ:—(వాసంతితో) ఇవాళ మననడక చాలా హాయినిచ్చిందికదూ?

వాసం:—అవును. ఇలాంటిది నేనెప్పుడూ అనుభవించలేదు.

బాబూ:—రోజూ సాయంత్రం షికారుకు వెళ్ళవూ?

వాసం:—ఆc. రాంబాబూ, నేనూ వెళ్ళుతూవుంటాము. కానికొద్దిదూరమే.

బాబూ:—నీవుకూడా తోటలోకి వెళ్ళాలనుకుంటున్నావా?

వాసం: – లేదు. ఇక్కడేవుంటాను.

బాబూ:—అయితేనేనూ ఇక్కడేవుంటాను.—రోజూ మనం యిలాగే షికారుకు వెళ్ళటం నీకు యిష్టంకాదూ?

వాసం:—వద్దు. మీరిలా చేయవద్దు.

బాబూ:—అంటే? నీవు యిందాక వస్తానన్నావుకదూ?

వాసం:—అవును. కాని—తరువాత నా అభిప్రాయం మార్చుకున్నాను.

బాబూ:—ఎందుకని?

వాసం:—మీరు క్రొత్తవారు. మీకు నావిషయం తెలియదు. నేను—కాదు. ఆ విషయాన్ని గురించి మీతో మాట్లాడకూడదు.

బాబూ:—కాదు. నీవు చెప్పదలచుకొన్నది నాతో చెప్పటంలో ప్రమాదం లేదు.

వాసం:—(తటపటాయించి) నేను తక్కినయువతులవంటి దానను కాను. నన్ను గురించి—నామీద—కృప. నేను మీతో రాగూడదు.

బాబూ:—ఏంటో! నీవుచెప్పేది నాకు అర్థంకావటంలేదు. నీవు ఏమీతప్పు చేయలేదుగా ?

వాసం:—నేనేమీ చేయలేదు. కాని నా-ఇక అవిషయాన్నిగురించి నేనేమీ చెప్పలేను. త్వరలోనే మీరు ఇతరుల దగ్గరనుంచి అవిషయం తెలుసు కుంటారు.

బాబూ:—సరే! అడగనులే.

వాసం:—మిమ్మల్ని ఒకవిషయం అడిగి తెలుసుకోవాలను కుంటున్నాను.

బాబూ:—ఏమిటది ?

వాసం:—అమెరికాలో హాయిగా బ్రతకగల్గటం తేలికనుకుంటాను.

బాబూ:—నీవనుకున్నంత తేలికగాదు. మొదట్లో కష్టపడి పనిచేయవలసి వుంటుంది.

వాసం:—అందుకు నేనుసిద్ధమే.

బాబూ:—నీవా ?

వాసం:— అవును. నేను చాలా ఆరోగ్యంగా, బలంగావున్నాను. కష్టపడటం నాకు వనకుమారి అత్తయ్య చిన్నతనంనుంచి నేర్పింది.

బాబూ:—అయితే మావెంటరా.

వాసం:— మీరుఎగతాళికి అంటున్నారా?రాంబాబుతోకూడాఇలాగేచెప్పారు. —నాకు కావలసింది అక్కడ ప్రజలు యిక్కడమాదిరిగా పెద్ద 'నిష్ట పరులు'గా వుంటారా ?

బాబూ:—నిష్ఠపరులా ?

వాసం:—అవును. అంటే ఇక్కడున్నంత ఇదిగా 'ప్రవర్తన, ఆచార వ్యవ హారాలు' కలిగివుంటారా అని.

బాబూ:—ఎందుకువుండరు ? ఇక్కడకంటే ఇంకా బాగానేవుంటారు. అందులో నీవు భయపడనక్కర్లేదు.

వాసం:—మీరు నన్ను అర్థం చేసుకోలేదనుకుంటాను. నేనుకోరేది ఇక్కడ వున్నంతగా 'ప్రవర్తన, అచారవ్యవహారాలు, నిష్ఠ' అక్కడవుండవు కదా అని.

బాబూ:—వుండవూ ? అయితే వారు ఎలావుండాలని నీకోరిక ?

వాసం:—వారు సహజ మానవులుగా వుండాలని

బాబూ:—ఓ! అదా. అలాఅయితే నాఅభిప్రాయంలో వారుఅలాగేవుంటారు.

వాసం:—అలావున్నప్పుడే నేను అక్కడ బ్రతకగలుగుతాను.

బాబూ:—అయితే నీవు తప్పకుండా మాతోరా.

వాసం:— మీతోరావటం నాకు యిష్టంలేదు. నేను వొంటరిగానే వెళ్లుతాను. —ఓహ్ ! నేను బ్రతకాలి. నా జీవితాన్ని ఒకమార్గంలో నడిపించాలి.

రాజా:—(శోభాదేవితో, భార్యతో, మాట్లాడుతూ దగ్గరలో) ఆగు. కమలా! నేనుతెస్తాను. నీకు చలిలో జలుబుచేస్తుంది.

(గదిలోకివచ్చి భార్య శాలువాకోసం అటూ, ఇటూ చూస్తాడు.)

కమ: —(బయటనుంచి) బాబూరావూ! నీవుకూడా రా. మేము చలిపందిట్లోకి వెళ్ళుతున్నాము.

రాజా:—కాదు. బాబురావు నాదగ్గరవుంటాడు. — ఇదిగో వాసంతీ ! ఈ శాలువా తీసుకొని వాళ్ళతో నీవుకూడవెళ్ళు. మేమిక్కడే వుంటాము. కమలా !

కమ: —సరే ! మంచిది. మేము వెళ్ళుతున్నాము.

(కమలాదేవి, శోభాదేవి, వాసంతి, చెట్లగుబుర్లోకి వెళ్ళుతారు. కొంతదూరం పోయేంతవరకు రాజారావు వారినిచూస్తూవుంటాడు. తరువాత బాబూరావుదగ్గరకు వచ్చి అతనిచేతులు ఆప్యాయనంగా పుచ్చుకుంటాడు.)

రాజా:—బాబూరావూ ! ఇక మనమిద్దరమేవున్నాము. నేను నీకు సర్వదా కృతజ్ఞుణ్ణి.

బాబూ:—ఛీ ! అవేంమాటలు-

రాజా:—నాయిల్లు, నాసౌఖ్యం. సంఘంలో నాగౌరవం—అన్నీ నీకు నేను ఋణపడివున్నాను.

బాబూ:—అందుకునాకుసంతోషమే. ఒకవెధవపనివల్ల మంచిదేజరిగింది.

రాజా:—(భుజాలు సవరిస్తూ) నీవు నాకుచేసినమేలుచూస్తే నీలాంటివాళ్లు లక్షకు, ఒక్కడుకూడా వుంటాడా అనేది సందేహం. అవునా.

బాబూ:—బావా! చాలా తమాషాగా మాట్లాడుతున్నావే. అప్పుడు మనం కుఱ్ఱవాళ్ళం, కుఱ్ఱచేష్టలుచేసాం. మనలోవొకడు నిందమోయవలసి వచ్చింది. అంతేగా.

రాజా:—కాని నేరంచేసినవాడు భరించటం సహజం.

బాబూ:—చాల్లేవూరుకో. ఆసమయంలో నిరపరాధియే అనిందమోయుటం సబబుగావున్నది. చూడు. నాకేమీ జంఝాటనంలేదు. నేను బొత్తిగా దరిద్రుణ్ణి. ఆఫీసుపనినుంచి తప్పించుకోవటం నిజంగా నాఅదృష్టమే. మరి నీకో—అప్పటికి నీతల్లి బ్రతికేవున్నది. పైగా అప్పుడే నీవు కమలతో రహస్యంగా ప్రేమించటం ప్రారంభించావు. కమలకుకూడ నీమీద గాఢానురాగం యేర్పడ్డది. అలాంటిసమయంలో ఈరహస్యం బయల్పడితే మీ యిద్దరిమధ్య యేంజరిగేది ?

రాజా:—అదినిజమే ? కాని—

బాబూ:—నీవు కమలకోసమటగా రాంభాయితోవున్న సంబంధాన్ని త్రెంచుకున్నది? ఆమెతో తెగత్రెంపులు చేసుకొవాలనే నీవు ఆనాటిసాయంత్రం ఆమెదగ్గర వున్నావు.

రాజా:—అవును! ఆత్రాగుబోతు ఇంటికి వచ్చిననాడే — అది కేవలం కమలకోసమే చేసాను. కాని అంతకంటె నీత్యాగం మెచ్చుకోతగ్గది. మొత్తం నిందఅంతా నీనెత్తినవేసుకొని వెళ్ళిపోయావు.

బాబూ:—ఇక నీస్తుతి చాలించుబావా! నీవు నాస్నేహితుడివి. నిన్ను రక్షించాలనుకున్నాను. ఇది మనమిద్దరము ఆలోచించి చేసినపనే— నిజంగా మనస్నేహాన్నిగురించి నేనెంతో గర్వపడుతూ వుండేవాడిని. నీవు విదేశాలకువెళ్ళి లండను, పారిస్‌నగరాల్లో చదువుకొని తిరిగి వచ్చిన విజ్ఞానవేత్తవు. మరి నేనో బురదలోచిక్కుకున్న మృగంలాగా దరిద్రావస్థతో బాధపడుతూ వుండేవాడిని. అలాంటివాడిని, పైగా నీకంటె నాలుగు సంవత్సరాలు చిన్నవాడిని, నీ స్నేహితుడిగా దగ్గరకు తీయటం నా అదృష్టంకాక మరేమిటి ? కమలను ప్రేమించటం

వల్లనే అది జరిగిందనుకో. అయినా నేను చాలాగర్వపడ్డాను. నేనేంటి, నీ స్నేహంచేయటానికి ఎవరు అంగీకరించరు? ఎవరు నీకోసం సర్వం త్యాగంచేయటానికి సిద్ధపడరు ? — నా విషయంలో దాన్నిగురించి బహుశా ఒక నెలరోజులు టవున్‌లో చెప్పుకొని వుంటారు. దానివల్లనేను విశాల ప్రపంచంలోకి వెళ్ళగలిగాను.

రాజా:—ఆకథ యింకా చాలామంది మరచిపోలేదు.

బాబూ:—నిజంగానా ? అయినా నాకేం. నేను యిక్కడ వుండేవాడినయితేగా.

రాజా:—అయితే ! నీవు మళ్లీ తిరిగి వెళ్ళాలనుకుంటున్నావా ?

బాబూ:— ఆఁ.

రాజా:—ఇప్పట్లో కాదనుకుంటాను.

బాబూ:—ఎంతతర్వగా వీలుంటే అంతత్వరగా పోవాలనివున్నది. శోభాదేవి బలవంతంమీదనే నేను యిక్కడకువచ్చాను. తెలుసా.

రాజా:—నిజంగానా ? ఆమె యిక్కడకు రావటంలో వుద్దేశం ?

బాబూ:—ప్రత్యేకించి వేరే ఏమీలేదు. ఆమెకు వయసు మళ్ళుతుంది. ఇల్లుచూడాలనే బుద్ధిపుట్టింది. నన్నుకూడా రమ్మనిబలవంతంచేసింది. నేను రానని చెప్పినా వూరుకోలేదు. చివరకు తప్పిందికాదు. బావా ! ఇక్కడ వొక పొరపాటు జరిగినందుకు నీవు క్షమించాలి.

రాజా:—ఆమెతో యీరహస్యం చెప్పలేదుగదా !

బాబూ:—అదే నేను చేసిన తప్పిదం. కాని అది నేను చేయక తప్పలేదు. బావా ! శోభాదేవి నన్ను యెలా పెంచి పెద్ద చేసిందో నీకు తెలియదు. నిజంగా అమెకు మించిన తల్లి నాకీ ప్రపంచంలో మరొక స్త్రీ లేదంటే నమ్ము. మొదట్లో మేము అమెరికా వెళ్ళినప్పుడు చాలా యిబ్బంది పడ్డాము. కొన్ని నెలలపాటు నేను జబ్బుతో బాధపడవలసి వచ్చింది కూడాను. అలాంటి సమయాల్లో ఆమె ఉపన్యాసాలిచ్చి, హొటల్సులో పాటలుపాడి, నృత్యంచేసి నాకోసం డబ్బు సంపాదించుకొస్తూ వుండేది. వద్దన్నా వూరుకొనేదికాదు. అలాంటి స్త్రీ యిక్కడకు వస్తూ

నన్ను కూడా రమ్మనటంవల్ల నేనురానసటం, ఆమె గ్రుచ్చి గ్రుచ్చి కారణం అడగటం, దాని మీద నేను యీకథ చెప్పటం జరిగింది.

రాజా:—ఊఁ. తరువాత.

బాబూ:—తరువాత—ఇందులో నేను నిరపరాధినని తేల్చింది. నన్నెవరు ఇక్కడ వ్రేలుపెట్టి చూపించలేరని తీసుకొనివచ్చింది—బావా! నీవు భయపడనక్కర్లేదు. శోభా యీరహస్యం ఎప్పుడూ బయటపెట్టదు. ఇక నాసంగతి. నీవు అనుమానించ నక్కర్లేదు.

రాజా:—అవును—నీమాటమీద నాకెప్పుడూ విశ్వాసమే.

బాబూ:—ఇదుగో. మళ్ళీ నాచేయి నీచేతిలోవేసి చెప్పుతున్నాను. ఈ రహస్యం మాయిద్దరినుంచీ బయటికి వెళ్ళదు—ఈ వున్న నాలుగు రోజులు కులాసాగా కాలంగడిపి వెళ్ళాలనికోరిక. ఇవాళ్టిమాప్రయాణం ఎంతహాయిగా వున్నదనుకొన్నావు—సరే! బావా! ఆ అమ్మాయి తలిదండ్రులేమైనారు ?

రాజా:—ఓహో! బాబూ! నీకు ఆవిషయం ఇదివరకే వ్రాసానుగా. నీకు నావుత్తరాలు అందలేదూ:

బాబూ:—ఆఁ. అందినై—చివరకు త్రాగుబోతు ఆమెను విసర్జించాడు.

రాజా:—పాపంపండింది. వాడు చచ్చిపొయ్యాడు.

బాబూ:—ఆమెకూడా చనిపోయిందిగా

రాజా.—నాకు ఒకదానికిమాత్రం సంతోషంగా వున్నది. ఆమె అది జరిగినట్టుకూడా ఏమాత్రం అంగీకరించలేదు.

బాబూ:—ఆపిల్లకు ఆశ్రయంయిచ్చి మంచిపని చేసావు.

రాజా:—అవును. యదార్థానికి ఆబాధ్యత వహించింది వనకుమారి.

బాబూ:—వనకుమారా ?—మరచిపొయ్యాను. ఇవాళ ఆమె ఎక్కడా కనపడలేదే!

రాజా:—స్కూలు వున్ననాడు స్కూల్లోను లేకపోతే, రోగుల్నిచూడటం ఆమె నిత్యకృత్యం.

బాబూ:—ఆపిల్లమీద ఇంత శ్రద్ధతీసుకొన్నది వనకుమారి అన్నమాట.

రాజా:—అవును. ఆమెకు పిల్లలకు పాఠాలుచెప్పటం అంటే సరదా. అందుకనే బోర్డుస్కూల్లోచేరింది—నిజంగా ఆమె ఉద్యోగానికి పాటు పడటం నాకే తలవంపులుగా వున్నది చూచేవాళ్ళకు నేనేదో ఆమె పోషణబాధ్యత వహించనట్లు కనబడుతుంది.

బాబూ:—పోషణబాధ్యతా ! ఎందుకూ? ఆమెకు తనజీవితాన్ని పోషించు కునే ఆస్తివుందనుకుంటాను ?

రాజా:—చిల్లిగవ్వకూడా లేదు. నీకు గుర్తేవుంటుంది. నీవు ఇక్కడనుంచి వెళ్ళబోయేటప్పటికే నాతల్లిచేసే వ్యాపారం తలక్రిందులైంది. అప్పటికి లెక్కలు చూచుకుంటే నాతల్లిఆస్తిఅనేది ఒక కానీకూడా మిగల లేదు. తరువాత వెంటనే నాతల్లి చనిపోయింది. ఇక వసకుమారికి చెందేభాగం ఏమున్నది ?

బాబూ:—పాపం !

రాజా:— అయినా ఆమెవిషయంలో నేను అశ్రద్ధచూపటంలేదు. ఈయిం ట్లోనే ఆమెవుంటుంది. వుండటానికి అభ్యంతరంకూడాలేదు. ఇకఆమె వుద్యోగంద్వారా సంపాదించుకునేది తన స్వంతఖర్చులకె వాడు కుంటుంది. కనుక ఆమెకులోటేంటి ?

బాబూ:—అఁ. కాని అక్కడ అమెరికాలో మా దృష్టివేరు.

రాజా:—ఓహ్ ! అలాంటివిప్లవం ఇక్కడ మేము అంగీకరించం. భగ వంతుడు మేలుచేస్తే ఇప్పటికి యిక్కడ యేలోటు కనబడటంలేదు. ఆడవాళ్ళకిక్కడ సంఘంలో వారికి 'తగినస్థానం' మేమెప్పుడూ యిస్తూనేవున్నాం. — అది వసకుమారిదోషమే. ఆమె అంగీకరిస్తే ఎప్పుడో పెండ్లిజరిగి పోవలసింది. చాలా సంబంధాలువచ్చి పోయినై. ఎందుకో, దేన్నీ అంగికరించలేదు — వయస్సు మళ్ళిపోతుంది. ఆరోగ్యంకూడా చెడగొట్టుకుంటుంది. ఇక ముందుసంగతి ఏంజరుగు తుందో?—ఇక నాసంగతి. అనేక బాధ్యతలు, అనేక వ్యవహారాలు. క్షణం తీరికలేదు. ఎప్పుడూ ఏదొకటి నెత్తినవేసుకొని మోయవలసి వస్తూనే వుంటుంది.

(కాగితాల కట్టతీసుకొని వస్తున్న నటేశాన్ని చూపుతూ)
అదిగో మళ్ళీ ఏదోవస్తుంది.

నటే:—(కాగితాల కట్టచూపుతూ) విక్రయ కంట్రాక్టులన్నీ పూర్తిచేయించానండీ !

రాజా:—(హడావుడిగా) బాబూ! క్షమించు. ఇప్పుడేవస్తాను (నటేశంతో) రా ! నీతో కొంచెంమాట్లాడాలి. (రాజారామ్, నటేశం ప్రక్కగదిలోకి వెళ్ళుతారు)

(రాజారామ్, నటేశాన్ని ప్రక్కగదిలోకితీసుకొని వెళ్ళుతాడు. బాబూరావు, వారు లోపలికి వెళ్ళేవరకు వారినిచూస్తూ తోటలోనికి వెళ్ళటానికి వెనక్కు తిరిగాడు. వనకుమారిచేతిలో ఒకసంచిపట్టుకొని కుడిప్రక్కనుంచి వస్తుంది.)

వన:—గుడ్‌మార్నింగ్ !

బాబూ!—గుడ్‌మార్నింగ్ !

(వనకుమారి ప్రక్కకు తప్పుకోటానికి ప్రయత్నిస్తుంది)

బాబూ:—వనకుమారీ ! ఎప్పుడూ ఏదో హడావుడివున్నట్లు కనబడుతున్నావు.

వన:—నేనా ?

బాబూ:—అఁ. నిన్నకూడా ఇంతే. నన్నుచూడగానే తప్పుకున్నావు. నీతో మాట్లాడటానికే వీలులేకపోయింది—మనం బాల్యస్నేహితులం.

వన:—ఓహ్ ! అదిఎప్పుడో—చాలా—చాలా సంవత్సరాలక్రిందటి మాట.

బాబూ:—పదిహేను సంవత్సరాలు. అంతేగా ! నేను మారిపోయా ననుకుంటున్నావా ?

వన:—నీవా ?—అవును. చాలా మారిపోయావు.

బాబూ:—అంటే !

వన:—అంటే ఏమీలేదు—

బాబూ:—మళ్ళీమనం కలుసుకున్నందుకు నీకేమీసంతోషం—

వన:—నేను నీకోసం చాలాకాలం ఎదురుచూచాను—చాలా కాలం.

బాబూ:—నాకోసమా ? ఎందుకూ ?

వన:—నీవుచేసినతప్పుకు ప్రాయశ్చిత్తం చేసుకోటానికి.

బాబూః—నేనా ? ప్రాయశ్చిత్తం ? ఏంటీ ?
వనః—మరచిపోయావా ? నీవల్ల ఒకస్త్రీ పతితురాలై కుమిలి, కుమిలి చనిపోయింది. నీవల్ల ఒకబాలిక తలఎత్తుకొనితిరగటానికి వీలులేకుండా వున్నది.
బాబూః—వనకుమారా ! నీనోటినుంచి యిలాంటిమాటలు వెలువడతై అని నేను ఎన్నడూ అనుకోలేదు. మీఅన్నయ్యా అవిషయంలో ఏమీ—?
వనః—వుహు ! అంటే ?
బాబూః—అంతేనా—ఆఁ. ఏమీలేదు. 'నాతరఫున మీఅన్నయ్యా మాట్లాడ లేదా' అని.
వనః—నీతరఫునా ? మాఅన్నయ్యా ? ఆయననీతికి కట్టుబడినవ్యక్తి.
బాబూః—అవును. మీఅన్నయ్యాసంగతి నాకుతెలుసు—ఇప్పుడే చాలా మార్పువున్నట్టు కనబడుతుంది.
వనః—మార్పా ! పొరపాటు. నాకుతెలుసు. రాజారామ్ గుణవంతుడు.
బాబూః—అవును ! అవును. నేనుఅన్నది అదికాదు—నీవు నన్నెలాఅర్థం చేసుకున్నావో ఇప్పుడుతెలుసుకున్నాను వనకుమారీ !
వనః—నీసంగతి తెలుసుకున్నాను. (తోటవంక వేలుచూపుతూ) అదుగో! రాంబాబుతో ఆడుకొంటున్న ఆపిల్లను చూశావుకదూ ! వాసంతి—నీవు యిక్కడనుంచి వెళ్ళగానే నాకువ్రాసిన ఉత్తరంసంగతి గుర్తువుందా ? —నీమీద పూర్తిగా నమ్మకం వుంచమన్నావుకదూ ? అలాగే నీమీద నమ్మకంవుంచానుబాబూ !—కాని, తరువాత నీవిషయంవింటే—
బాబూః—ఆఁ.
వనః—నన్ను నీవు అర్థంచేసుకునే వుంటావు. అంతకంటె ఏమీ నేను చెప్పలేను—నీవు అమెరికావెళ్ళి నూతనజీవితం ప్రారంభించావ్. కాని—కాని నీకు యిక్కడ కొన్నిబాధ్యతలున్నవని గ్రహించలేదు. గ్రహించినా బారంవహించగల శక్తి నీలోలేదు. నీకు మారుగా ఆ బాధ్యత నేనువహించాను—ఇప్పుడు ఆ అనాథబాలికకు నేనే తల్లిని. నాశక్తిని బట్టి ఆపిల్లనుపెంచి పెద్దదానిని చేశాను.
బాబూః—అందుకోసం నీజీవితమంతా పాడుచేసుకున్నావు.

వన: —పాడుచేసుకోలేదు—నీవు చాలా ఆలస్యంగా వచ్చావు.
బాబూ:—వనకుమారీ! నీకు నిజంచెప్పాలంటే—సరే! మంచిది. నీవు నామీదవుంచిన స్నేహగౌరవాలకు నీకు హృదయపూర్వక ధన్యవాదాలు.
వన:—(విచారముఖంలో నవ్వుతెచ్చుకుంటూ) ఆc. ఇప్పటికైనా—ఎవరో వస్తున్నట్లుంది. నేనిక్కడ వుండకూడదు. వెళ్ళుతున్నా బాబూ!

(వనకుమారి గబగబా ప్రక్కగదిలోకి వెళ్ళిపోతుంది. శోభాదేవి, కమలాదేవి తోటలోనుంచి వస్తారు.)

కమ;—శోభా?—నీవు దీర్ఘంగా ఆలోచిస్తున్నావేంటి?
శోభా;—నేను ఆయనతో గట్టిగా మాట్లాడాలనుకుంటున్నాను.
కమ:—ఫలితం?—దానివల్ల పరిస్థితులింకా చెడిపోతై.—బాబూ! ఒంటరిగా వున్నావే!
శోభా:—బాబూ! ఎందుకిక్కడ నిలబడివున్నావు? తోటలోకివెళ్ళు. అక్కడ వాసంతి వున్నది.
బాబూ:—నేనూ అదే అనుకుంటున్నాను.
కమ:—ఆc.
శోభా;—ఇదిగో! బాబూ! నీవు వాసంతిని బాగా చూసావా?
బాబూ:—చూసా ననుకుంటున్నాను.
శోభా;—మళ్ళీ చూడుబాబూ! నీకు తగినపిల్ల.
కమ:—శోభా!
బాబూ;—నాకు తగినపిల్లా!
శోభా:—అదే అనుకుంటున్నాను. వెళ్ళు—పో—వాసంతిదగ్గరకు వెళ్ళు. బాబూ!
బాబూ:—నన్ను బలవంతపెట్టనక్కర్లేదు. నాకేమీ సిగ్గులేదులే. (తోటలోకి వెళ్ళుతాడు).
కమ:—శోభా! నీ మాటలు నన్ను తలక్రిందులుచేస్తున్నవి. నిజంగానీవు-
శోభా:—అవును. నిజంగానే. ఆపిల్లను చూస్తుంటే నాకు మహదానందం వేస్తుంది. చక్కనిపిల్ల, అమాయకురాలు, గుణవంతురాలు, బాబుకు తగినభార్య. అలాంటిపిల్ల కావాలని బాబు కలలుకంటూ వుండేవాడు.

కమః—వాసంతి — రాంభాయి కూతురు వాసంతితో — శోభా ! బాగా ఆలోచించి—

శోభాః—నేను బాగాఆలోచించే యీనిర్ణయానికివచ్చాను. నాకు కావలసింది, అన్నిటికంటెముఖ్యం వాడిసుఖం. వాడికి తగినబిడియం. ఆడవాళ్ళనిగురించి బొత్తిగాతెలియని అమాయకుడు. ఆడవాళ్ళను చూస్తే సరి. దూరంగా పారిపోతాడు.

కమః—వాడా ? బాబూరావేనా ? శోభా ! నీమాటలునాకు నాకు నవ్వు—

శోభాః—నీకేమి తెలియదు. ఆవెధవకథలు నమ్మబోకు. రాజారామ్ ఎక్కడ ? నేను యీవిషయం మాట్లాడి తేలుస్తాను.

కమః—శోభా ! ఇక ఆవిషయం ఎత్తబోకు.

శోభాః—బాబు వాసంతికిజోడు, వాసంతికిబాబుజోడు రాజారామ్ తక్కన పని చేయగలడు.

కమః—అమెరికా దేశంలోని అనాచారాలు ఇక్కడ ప్రవేశపెట్టాలనుకుంటున్నావు. రాజారామ్‌ను అంతటి అవినీతికి వొప్పించి—

శోభాః—రాజారామ్ అనుకున్నంత నీతిపరుడుకాదు.

కమః—శోభా ! ఏం మాట్లాడుతున్నావో తెలుసా ?

శోభాః—తెలుసు. బాగాతెలిసియే మాట్లాడుతున్నాను. రాజారామ్‌మామూలు ఏవ్యక్తికంటెకూడామించి చెప్పుకోతగిన నీతిపరుడుకాదు. తెలిసిందా?

కమః—ఆఁ. తెలిసింది. నీవు ఇంకా ఆయన్ని ద్వేషిస్తూనేవున్నావు. నీవు వెనుకటిసంగతి మరచిపోలేదు.—ఇంత అవమానం, అప్రతిష్ట తెచ్చిపెట్టిననీవు రాజారామ్‌ను గురించి ఎలాగైనా మాట్లాడగలవు.

శోభాః—కమలా ! అసంగతా ! అప్పుడు నన్ను నేనే మరచిపోయాను.

కమః—అందుకు రాజారామ్ నిన్నేమీ పల్లెత్తిఅనలేదు. సరిగదా నిన్ను గౌరవంగానే చూసాడు. ఆ వొక్క సంఘటనేచాలు, రాజారామ్‌ఎలాటివాడో తెలుసుకోడానికి—నీవు రాజారామ్‌ని ప్రేమించావు. రాజారామ్ నిన్నుప్రేమించలేదు. అందులో ఆయన తప్పులేదు—అప్పటినుంచీ నేనంటే నీకుద్వేషం. (ఏడుస్తుంది) నాసుఖం, నాఐశ్వర్యం, మాదాంపత్యం నీలో అసూయ, ద్వేషాల్ని రేకెత్తిస్తున్నై— పోయినదానివి పోక

మళ్ళీవచ్చావు. వచ్చి మాకుటుంబాన్ని, రాజారామ్ గౌరవ, ప్రతిష్ట లను నాశనంచేయటానికి తలపెట్టావు. సర్వనాశనంచేస్తేనే నీకళ్ళు చల్లబడత్తై. కానివ్వు.

(ఏడుస్తూ గదిలోకి వెళ్ళుతుంది.)

శోభా:—(ఆమెవంకచూస్తూ) పిచ్చిది.

(రాజారామ్ తనగదిలోనుంచి బయిటికివస్తూ వాకిలిదగ్గర లోపలవున్న నటేశంతో మాట్లాడుతూ నిలబడతాడు.)

రాజా:—నటేశం! ఆబీదల అన్నదానంకోసం నూటపదహార్లు పంపించు. (వెనక్కు తిరిగి శోభాదేవినిచూచి) శోభా! (ముందుకువస్తూ) ఒంటరిగా వున్నావే? కమలఎక్కడ?

శోభా:—ఇప్పుడే లోపలికివెళ్ళింది. పిలువనా?

రాజా:—అక్కరలేదు. (దగ్గరకువచ్చి) శోభా! నిన్ను క్షమాపణ కోరుకున్నతరువాత నీతోహృదయంవిప్పి మాట్లాడాలనిఎంతో అనుకున్నాను.

శోభా:—ఈ 'క్షమాపణలు' ఈ 'హృదయంవిప్పిచెప్పటం' నాకు పనికిరావు. రాజారామ్.

రాజా:—నన్ను అర్థంచేసుకోవాలి శోభా! వాసంతితల్లితో జరిగిన సంఘటన వల్ల నీవు నన్ను అపార్థం చేసుకొనివుంటావు. అదికేవలం. ఒక క్షణిక మాత్రమే—శోభా! నేను వొట్టుపెట్టుకొని చెప్పుతున్నా. అప్పుడు నేను కేవలం, నిజంగా నిన్నే ప్రేమించాను.

శోభా:—అప్పుడు నన్నే ప్రేమించావు. ఆవిషయం నీవునాకు వ్రాసిన ప్రతి లేఖలోనూ చెపుతూనేవచ్చావు—అది ఒకవిధంగా నిజంకూడా కావచ్చు. అప్పుడునీవు ఊహాప్రపంచంలో స్వేచ్ఛాలాపనచేస్తూ జీవితాన్ని ఆదర్శవంతం చేసుకొని సార్థకపరచుకోవాలనే కలలుకంటూ వుండేవాడివి. బహుశ నీవు నాలోతక్కిన స్త్రీలలోలేని నడవడి, మనోధైర్యం, స్వాతంత్ర్యం గమనించివుంటావు.—ఆ రహస్యాన్ని మన యిద్దరిలోనే దాచుకున్నాము. నీ తుచ్ఛ కామవాంఛ ఎవరికీతెలియదు.

రాజా:—శోభా! నీవు—

శోభా:—కాని నీవు తిరిగివచ్చినతరువాత—నాచుట్టూ బిగించబడే పంజ

రాన్ని నీవు చూచినతరువాత నన్నుగూర్చి ప్రజలు అనుకునే మాటలు విన్న తరువాత—

రాజా:—నీవు అప్పుడు ప్రజాభిప్రాయాన్ని త్రోసివేసేదానివి.

శోభా:—తలపాగాలకు, బిళ్ళగోచీలకు జోహారులు చేయమంటావు. సరే! అనాట్యకత్తె రాంభాయిని నీవుచూచిన తరువాత—

రాజా:—అదికేవలం పిల్లవాడిచేష్టలు. అంతే దాన్నిగురించి నీవుపెద్దగాతీసుకోకూడదు. అసలు వాస్తవం అనుకున్నదానిలో పదోవంతుకూడా జరుగలేదు.

శోభా:—కావచ్చు—కమల ఇంటికివచ్చిన తరువాత—కమల సౌందర్యమునుగూర్చి ప్రతివాడూ కవిత్వంఅల్లటం చూచినతరువాత—కమల తనపినతల్లిద్వారా చాలాఆస్తి సంక్రమించబోతుందని విన్నతరువాత నాతో సంబంధం అనవసరం అనుకున్నావు.

రాజా:—అసలు రహస్యం అదేశోభా! నేను నిజంగా కమలను ప్రేమించలేదు. మరొకరితో సంబంధం యేర్పడటంవల్ల నేను నిన్ను త్యజించలేదు. కేవలం—ఆస్తికోసం నేను కమలను చేసుకున్నాను. నాకు ఆస్తి అవసరమయినది.

శోభా:—అవిషయం సిగ్గువిడచి నాముందు చెబుతున్నావు.

రాజా:—కాదు. శోభా—నామాట.

శోభా:—ప్రతిఘటించటానికి వీలులేనంత మమకారం కమలమీద యేర్పడిందని - కాబట్టి కమలకోసం నన్ను త్యాగంచేయమని. నన్నుగొప్పదానిని చేస్తూ మన రహస్యం బయటపెట్టవద్దని వుత్తరం వ్రాశావుకదూ!

రాజా:—అవును. దానికి కారణంవిను. నేను పారిస్‌లోవున్నపుడు నాతల్లి యిక్కడ వ్యాపారం సాగిస్తూవున్నది. కాని ఆమెకు వ్యాపారసంబంధమయిన అనుభవం బొత్తిగాలేదు. నీకుతెలిసేఉన్నది. నేనుయిక్కడికి వచ్చేటప్పటికి వ్యాపారం దెబ్బతిన్నది. విపరీతనష్టంవచ్చింది. కుటుంబం దివాలాతీసేపరిస్థితిలో వున్నది. - నేను ఏదోవొకవిధంగా కుటుంబంనిలపాలి. కుటుంబ గౌరవాన్ని కాపాడాలి. అవునా?

శోభా:—నీకుటుంబంకోసం ఒకస్త్రీజీవితం నాశనంచేశావు.

రాజా:—కమల నన్ను బాగా ప్రేమించిందని నీకుతెలుసు.

శోభా:— నా జీవితం ?

రాజా:—శోభా ! నాతోనీవు సుఖపడేదానివి కావు,

శోభా:—నా సుఖంకోసం నన్ను త్యజించావా ?

రాజా:—నేను స్వార్ధంతో అపని చేశాననుకుంటున్నావా ? స్వవిషయం కోసం నేనలా యెప్పుడు చేసేవాడినికాదు. వ్యాపారంచేసే మనిషి జీవితం, అతని బాధ్యతలు, గౌరవ గౌరవాలు నీకు అర్ధంకావు. అతన్ని ఆధారం చేసుకొని వందలు - కాదు వేలమందిజీవులు బ్రతుకుతూ వుంటారు. నాకుటుంబం దివాలాతీస్తే మొత్తం యీ సంఘమంతాతల క్రిందు లౌతుందనే సత్యాన్ని నీవు గమనించావా ?

శోభా:— బహుశ నీవు యీ సంఘంకోసమే గత పదిహేను సంవత్సరాల నుంచి 'అసత్యం'మీద నీజీవితాన్ని ఆధారం చేసుకుంటూవచ్చావు.

రాజా:—అసత్యం ?

శోభా:—నిజంగా నీవు కమలను ఎందుకు పెండ్లిచేసుకొన్నావో ఆమెకు ఇంతవరకు తెలియదుగా ?

రాజా:—ఈ రహస్యాన్ని బయటపెట్టి ఆమెమనస్సుకు అనవసరంగా బాధ కలిగించాలనా నీ వుద్దేశ్యం ?

శోభా:—'అనవసరంగా'—? అవును. నీవు వ్యాపారస్థుడవు. 'అవసరం - అనవసరం' - నీవు తెలుసుకోవలసివుంటుంది. రాజారామ్‌నిజంచెప్పు. నీవు నిజంగా సుఖంగావున్నావా ?

రాజా:—అంటే నీవుద్దేశం నా కుటుంబజీవితంలోనా ?

శోభా:—అవును.

రాజా:—ఆc. నేను నిజంచెప్పుతున్నా శోభా! ఆయేటికాయేడు మాజీవితం నిత్యనూతనమై సుఖవంతంగా గడచిపోతోంది కమలకు నామీదవున్న కొందికీ అనురాగం పెరుగుతూ వున్నది. ఇప్పుడు మాకుటుంబం తక్కిన నగరవాసులకు ఆదర్శప్రాయంగా ఉంది.

శోభా.—తక్కిన నగరవాసులకు యీ అసత్యం తెలియదు.

రాజా:—అసత్యమా ?

శోభా:—అవును - ఈ పదిహేను సంవత్సరాలనుంచి నీవు మరుగుపరచిన అసత్యం.

రాజా:—శోభా ! నీవుదాన్ని అసత్యమని భావిస్తున్నావా ?

శోభా:—అవును. ఒకరకంగాకాదు. మూడురకాల ఆదిఅసత్యం, మొదటిది నావిషయంలో - రెండోది కమల విషయంలో - ఇక మూడోది బాబూరావునుగురించీ - అవునా ?

రాజా:—శోభా ! నాజీవితం ముక్కలు చేయదలచావా ?

శోభా:—నా మనస్సు విశాలమైనది. నీలాంటి స్వార్ధబుద్ధి నాలోలేదు.

రాజా:—బాబూరావుకుడా యీరహస్యం బయటపెట్టనని నాకు వాగ్దానం చేసాడు.

శోభా:—కాని రాజారామ్! నీలో ఎలాంటిశక్తికూడా నిన్ను యీ 'అసత్యం' నుంచి విముక్తి చెందమని ప్రేరేపించటంలేదూ ?

రాజా:—దానికి లొంగి నా కుటుంబసౌఖ్యాన్ని, సంఘంలో నాకున్న గౌరవస్థానాన్ని నాశనంచేసుకోమనా నీవుద్దేశ్యం ?

శోభా:—నీవిట్టిస్థానం చేపట్టటానికి నీకు హక్కెక్కడిది?

రాజా:—ఈ పదిహేను సంవత్సరాలనుంచి నా నడవడివల్ల సంఘానికినేను చేస్తున్న సేవవల్ల నేను ఆ హక్కును సంపాదించాను.

శోభా:—ఈ నగరంలో నీవు అందరికంటెధనికుడవు. నీకుటుంబం నీనడవడి ఆదర్శప్రాయంగా బావించబడుతున్నవి. నీ జీవితంలో కళంకం వున్నదని ఎవరికీ తెలియదు. - నీఆదర్శకుటుంబం - నీఆదర్శ జీవితం - నీ ఆదర్శసంఘసేవ పునాదిలేని, అగాథమైన వూబి బురదపై నిర్మించిన భవనంలాగాఉన్నవి. నీఅంతట నీవు ముందుగా జాగ్రత్త పడకపోయిన యీ భవనమంతా ఒక్కసారి ఫెళఫెళా మంటూ కూలి పోక తప్పదు.

రాజా:—శోభా ! నీవుతిరిగి యిక్కడకు రాపటంలో వుద్దేశ్యం ?

శోభా:—నీకాళ్ళక్రింద గట్టిపునాది నిర్మించటానికి .

రాజా:—ప్రతీకారం ? నేను అనుమానించినట్లే జరిగింది. కాని, శోభా ! నీవు జయించలేవు. అదిచేయగలవ్యక్తి ఒక్కడే ఒక్కడున్నాడు. కాని అతడు యీవిషయంలో నోరు తెరువడు.

శోభా:—బాబూరావ్ !

రాజా:— అవును. మరొకవ్యక్తి ఎవరూ నన్నేమీచేయలేరు. ఒకవేళచేయటానికి ప్రయత్నించినా సఫలంకాదు. ఎదిరించి పోట్లాడగలశక్తి నాలో వున్నది. - ఏదైనా చేయగలిగితే ఆతడే కాని అతడు నోరెత్తడని నాకు తెలుసు - పైగా అతడు త్వరలో వెళ్ళిపోతున్నాడు కూడాను.

(విశ్వేశ్వరావు, గుణచంద్ వస్తారు.)

విశ్వే:—నమస్కారం రాజారామ్‌గారూ ! మీకోసమేవచ్చాము. ఇవాళ రైల్వేస్టేషను గురించి కమర్షియల్ అసోసియేషనుహాల్లో మీటింగు జరుగుతుంది. మీరు రావాలి.

రాజా:—నేనా? ఇప్పుడు రావటానికి వీల్లేదు.

గుణ:—మీరు రాకపోతే ఎలా ?

విశ్వే:—కొంత వ్యతిరేకం కనబడుతుంది. ఆస్యూస్ పేపరువాలా వెంకటేశంగాడు ఒకమురాను పోగుజేసి సముద్రపు అంచునే రైల్వేలైసువేయాలని, మన స్కీములో స్వార్థం ఇమిడి ఉందని బాకా వూదుతున్నాడు.

రాజా:—అయితే మీటింగులో వారికి తెలియచెప్పు.

గుణ:—మేముచెప్పితే ఎవరింటారు. రాజారామ్‌గారూ ?

విశ్వే:—మీరేరావాలి. మిమ్మల్నిచూస్తేచాలు జనం నోరెత్తదు. మీరువచ్చి యీస్కీములో స్వార్థంలేదని చెప్పితే అందరూ నమ్ముతారు.

రాజా:—నేనురాలేను - నావంట్లో బాగాలేదు — నన్ను (వివేకానందుడు వస్తాడు.)

వివే:—క్షమించండి రాజారామ్‌గారూ ! నాకు పిచ్చెక్కిపోతూఉంది.

రాజా:—ఏంటి ? ఏం జరిగింది ?

వివే:—మిమ్మల్ని ఒకప్రశ్న అడగాలను కొంటున్నాను. మీ ఆశ్రయాన్ని కోరి మీరక్షణక్రింద బ్రతుకుతున్న యువతి మీఆజ్ఞతీసుకొని బజార్లో, విచ్చలవిడిగా అతనివెంట—

శోభా:—అతనంటే ఎవరు సన్యాసిగారూ ?

వివే:—యీ ప్రపంచంలో ఏవ్యక్తినుంచి దూరంగా ఉండాలో అతడు—

శోభా:—శెభాష్ ! శెభాష్ సన్యాసీ !

వివే:—అందుకు మీరంగీకరించారా రాజారామ్‌గారూ !

రాజా:—(అతురతతో హాట్, చేతికర్ర తీసుకుంటూ) నాకుతెలియదు. క్షమించండి — నాకుచాలా తొందరపనివున్నది. నేను మీటింగుకు వెళ్ళాలి.

(జగదీశ్ ఎదురుగా వస్తాడు.)

జగ:—రాజా ! రాజా ! నీతో మాట్లాడాలనుకుంటున్నాను.

కమ:—(లోపలనుంచి బయటకివస్తూ) ఏంటిజగదీశ్ ?

జగ:—నీవు వెంటనే తోటలోకివెళ్ళి వాసంతిదగ్గరవున్న ఆమనిషికి బుద్ధి చెప్పాలి. ఆ మాటలు వింటుంటే నాకు వొల్లు కంపరమెత్తిపోయింది. వుష్ !

శోభా:—వుష్ ! ఆమనిషి ఏం మాట్లాడుతున్నాడు ?

జగ:—ఆఁ. ఆఁ—తనతో వాసంతిని అమెరికా రమ్మంటున్నాడు. వుష్ !

వివే:—అది జరిగితే ?

కమ:—ఏంటి ?

శోభా:—అదిజరిగితే అంతకంటె గొప్పసంగతి ఏ ముంటుంది ?

రాజా:—పొరపాటు. నీవువింటం పొరపాటు.

జగ:—అతన్నే అడుగు. అడుగో! ఇద్దరూజోడుగానే వస్తున్నారు. నేనిక్కడ వుంటంమంచిదికాదు. వుష్ !

రాజా:—(విశ్వేశ్వర్రావు, గుణచంద్‌లతో) మీరుపదండి ఇపుడే ఒక నిమిషంలో వస్తాను.

(విశ్వేశ్వర్రావు, గుణచంద్ బయటికివెళ్ళుతారు. బాబురావు, వాసంతి తోట లోనుంచివస్తారు.)

బాబూ:—శోభా ! ఈమె మనతోవస్తుంది.

కమ:—బాబూరావ్ ! నీకు మతివున్నదా ?

వివే:—(చెవులుమూసుకుంటూ)హరహరా! ఇది వింటున్నది నాచెవులేనా? పాపం! పాపం! నీదగ్గరనిజంగా పరస్త్రీవశీకరణశక్తి—

బాబూ:—(చేయిపైకెత్తుతూ) ఏంటి పంతులుగారూ ? మళ్ళీఅనండి.

వివే:—వాసంతీ! నీవునిజంగా బుద్ధిపూర్వకంగా వెళ్ళాలనుకుంటున్నావా?

వాసం:—ఇక్కడనుంచి వెళ్ళిపోవటం నాకు అవసరం.
విశే:—అయితే అతనితోనా—అతనితో !
వాస:—నన్ను ధైర్యంగా తనవెంటతీసుకొని వెళ్ళకలిగిన మరొకవ్యక్తి ఎవరున్నారో చెప్పగలరా ?
వివే:—సరే! మంచిది! వెళ్ళు - అతనెవరో తరువాత తెలుసుకుంటావు.
బాబూ:— నోరుముయ్.
రాజా:—ఇక అనవసరం.
వివే:—నేను నోరుమూసుకోటం అంటే సంఘానికి అపచారం చేస్తున్నట్లె. ఆపిల్లకు జరిగేఅన్యాయాన్ని అంగీకరించినట్లే. ఆపిల్లను పెంచిపెద్ద చేయటంలో నేనుకూడా భాగం తీసుకున్నాను. నాకు ఆపిల్లమీద—
బాబూ:—జాగ్రత్త ! ఇక నోరుఎత్తటం—
వివే:—వాసంతీ! తెలుసుకో! ఇతడే నీతల్లి అప్రతిష్టపాలు కావటానికి కారణం.
బాబూ:—పంతులూ— ?
వాసం:—ఇతడా? (బాబూరావుతో) నిజమేనా ?
బాబూ:—రాజారామ్ సమాధానమిస్తాడు.
రాజా:—ఇక అధిక ప్రసంగం పనికిరాదు. దాన్నిగూర్చి మాట్లాడటం మంచిది కాదు.
వాసం:—అయితే నిజమే !
వివే:—అవును. నిజమే! అంతేకాదు. నీవు వెంటవెళ్ళాలను కుంటున్నయితడు వొట్టిచేతులతో యిక్కడనుంచి పారిపోలేదు. రాజారామ్‌గారి ఇనపపెట్టి ఖాళీచేసి మరివెళ్ళాడు—రాజారామ్‌గారినడిగితే ఆవిషయమంతా తెలుస్తుంది.
శోభా:—అబద్ధం. పచ్చిఅబద్ధం.
రాజా:—ఆఁ.
కమ:—అయ్యో ! అయ్యోదేవుడా ?
బాబూ:—(చేయిఎత్తి వివేకానందుని దగ్గరకు వెళుతూ) నీవు నిజంగా ఎన్నిగుండెలు పెట్టుకొని—

శోభా:—బాబూ! వూరుకో !

వివే:—కొట్టు. చంపు. సత్యం బయటపడక తప్పదు—బయటపడింది. రాజారామ్‌గారు స్వతహా యీరహస్యం బయటపెట్టారు — టువునంతా ఎప్పుడో తెలుసుకుంది. వాసంతీ! ఇప్పుడునీవు తెలుసుకుంటున్నావు.

(కొంచెంసేపు నిశ్శబ్దం)

బాబూ:—(రాజారామ్ భుజంతట్టుతూ) బావా! ఏంచేశావు? ఇదంతా నీ చలవేనా ?

కమ:—(కన్నీటితో) వంశానికి అప్రతిష్ట—

కృష్ణపిళ్ళె:—(రొప్పుకుంటూ గబగబావస్తూ) రాజారామ్‌గారూ! త్వరగా రావాలి త్వరగా, పెద్దప్రమాదం జరగబోతూవుంది. రైల్వేస్ట్రైకు మార్చటానికి అవతలిముఠా—

రాజా:—ఆఁ. ఏంటి నన్ను—

శోభా:—(స్పష్టంగా) బావగారూ! మీరు సంఘనాయకులు కదూ! వెంటనే వెళ్ళి వ్యవహారం చక్కచేయాలి. అవునా?

కృష్ణ:—అవును. పదండి. మీ నైతికబలం మాకువుండాలి.

బాబూ!—(నెమ్మదిగా రాజారామ్‌తో) రేపు మనం దీన్నిగురించి మాటలాడు కుందాము.

(బాబురావు తోటలోకివెళ్ళుతాడు. రాజారామ్ ఆలోచనగా కృష్ణపిళ్ళె వెంట బయటికి వెళ్ళుతాడు.)



# మూడో అంకం

(అదేగదిలో రాజారామ్. చేతిలో బెత్తంపట్టుకొని అటూ, ఇటూ, కోపంగా తిరుగుతూ వుంటాడు. ప్రక్కగది వాకిలి తలుపులు కొద్దిగా తీసివుంటవి.)

రాజా:—(ప్రక్కగదిలో వున్న భార్యతో) వెధవ! బాగా తగిలినై. ఈ దెబ్బతో కాని వాడికి బుద్ధిరాదు—అసలు నీవే వాణ్ణి యింతదూరం తీసుకొనివచ్చావు. నీచనువు మూలకంగానే వాడు యింతవాడయ్యాడు. ఎక్కడబడితే అక్కడ, ఎవరు కనబడితే వాళ్ళవెంట బడుద్దాయిలాగా తిరగటం నేర్చుకున్నాడు. కుటుంబమర్యాద పాడుచేసే కొడుకు వుంటం కంటె అసలు సంతానం లేకపోయినా బాగుండేది—ఆఁ. ఎవరో వస్తున్నట్లుంది. మాట్లాడకు—(నటేశం వస్తాడు)

నటే:—లోపలికి రమ్మంటారా ?

రాజా:—ఆఁ. సముద్రం దగ్గరనుంచేనా !

నటే:—అవునండీ! మరి—

రాజా:—'పామ్‌ట్రీ' పూర్తయిందా ?

నటే:—'ఇండియన్‌గరల్' కూడా పూర్తి అయింది. కాని నాకు కొంత అనుమానంగా వున్నది సార్.

రాజా:—అనుమానమా ? అంటె ?

నటే:—వర్కర్సు భోజనానికి వెళ్ళగానే నేను లోపలికి వెళ్ళి అన్నీ జాగ్రత్తగా చూచాను. వాళ్ళుచేసిన రిపైర్సు నాకు నచ్చలేదు. అతుకులకు సరియైన కలప వేయలేదు. —అవోడ అమెరికా చేరేటట్లుగా నాకు కనపడలేదు.

రాజా:—ఆఁ.

నటే:—(ప్రక్కగది వాకిలిచూస్తూ నెమ్మదిగా) శ్యామలరావు ఈ రెండు రాత్రుళ్ళు నిద్రలేకుండా లాంతర్లు పెట్టుకొని పని చేయించాడు. తాను స్వయంగా చేసాడు. విని సంతోషించాను. కాని దగ్గరకు పోయిచూస్తె నాకు ఆపని నచ్చలేదు. అంతా అనుమానంగానే వున్నది—ఓడ సముద్రంలో మునిగిపోక తప్పదు. అనేకమంది ప్రాణాలు కోల్పోకతప్పదు.

మనం పెట్టిన డబ్బుకు డబ్బునష్టం—పైగా సంఘంలో మనకుతీరని అప్రతిష్ఠ రాక తప్పదు.

రాజా:— శ్యామలరావు మోసంతోనే యీపని చేసాడంటావా ?

నటే:—తప్పకుండా. కొత్త యంత్రాలు వచ్చినప్పటినుంచీ అతనికి మనసులో వేదనగానేవున్నది. వాటివల్ల ఎక్కువమంది పనివాళ్ళ అవసరం తగ్గుతుంది. కనుక ఏదోవొక విధంగా అవి నిష్ప్రయోజనం అని చూపటానికే యీ తంతుపన్ని ఇలాచేశాడు.

రాజా:—ఆఁ. సరే! 'ఇండియన్ గరల్' ప్రయాణం ఆపటం అవసరం. ఈరహస్యం బయటపెట్టి సమాజంమీద మనకున్న గౌరవాన్ని ప్రకటించటం మంచిది. కేవలం లాభాలకోసం ప్రాణాలుపోగొట్టటం నామనస్సు అంగీకరించదు.

నటే:— అలా చేయటమే మంచిది బాబూ!

రాజా:— ఆఁ. అగు. అగు. ఈ రహస్యం అప్పుడే బయటపెట్టవద్దు. ముందు నేను 'ఇండియన్ గరల్' చూడటం అవసరం. తరువాత మాట్లాడుదాం: అంతవరకూ ఒక్కమాటకూడా బయటకు పోనివ్వద్దు జాగ్రత్త.

నటే:— చిత్తం.—

(నటేశం బయటికి వెళ్ళుతాడు. అప్పుడే లోపలికి జగదీశ్ వస్తాడు)

జగ:— గుడ్‌మార్నింగ్, రాజా! నిన్న కమర్షియల్ అసోసియేషన్ మీటింగులో నీవు సాధించిన విజయానికి నాఅభివందనాలు. నిజంగా అలాంటి విజయసాధన నేనెక్కడా చూడలేదంటే నమ్ము. ఈర్ష్యా స్వార్థపరత్వాలమీద చైతన్యపూరిత ప్రజానీకం దెబ్బకొట్టి విజయలక్ష్మిని వరించింది.

రాజా:— అవును— అవును.

జగ:— కాని యింకా అంతిమపోరాటం అలాగే వుందనుకుంటాను.

రాజా:— రైల్వే బ్రాంచిలైనును గురించేనా ?

జగ:— అవును. ఆ వెంకటేశంగాడి గొడవ నీకు తెలిసే వుంటుందనుకొంటాను.

రాజా:— ఊహుఁ! తెలియదే! ఏంటి?

జగ:— టవున్‌లో అక్కడక్కడా వినబడే మాటల్ని మూటకట్టి ఒకపెద్ద వ్యాసం తయారు చేయాలనిఆలోచిస్తున్నాడు.

రాజా:— అంటే?

జగ:— రైల్వేబ్రాంచిలైను ప్రక్కనున్న భూములు ముందుగానే కొని వేస్తున్నారట.

రాజా:— అలాంటి దేదైనా జరిగినట్లు తెలిసిందా?

జగ:— టవునంతా అనుకుంటున్నారు. నేను క్లబ్‌కు వెళ్ళితే అక్కడ కూడా ఇదేగొడవ. మనప్లీడరు ఒకాయన కమీషన్ తీసుకొని చుట్టూ వున్న అడవులు, ఖనిజభూములు ఇంకా చాలా కొనివేస్తున్నాడని చెప్పు కుంటుంటే విన్నా.

రాజా:— ఎవరికోసమని అనుకుంటున్నారు?

జగ:— మొత్తానికి మనటవునుకు సంబంధించని ఏదోఒక కంపనీవాళ్ళని అనుకుంటున్నారు. వాళ్ళు ముందుగానే యిక్కడకు రైలుపడుతుందని పసికట్టి ధరలు పెరక్కముందే చౌకగా భూములన్నీ కొనివేస్తున్నా రట. ఎంతదుర్మార్గం?—వుష్!

రాజా:— దుర్మార్గమా?

జగ:— అవును. ఎక్కడో బయటవాళ్ళు వచ్చి చౌకగా మన భూములు కొనటం, దానికి కమీషన్‌కు ఆశపడి మనప్లీడరే ఒకాయన సహాయ పడటం—వచ్చేలాభాలన్నీ బయటవాళ్ళకే చెందుతాయి.

రాజా:— జగదీశ్! అదంతా ఒట్టిరూమరే.

జగ:— ఏదైనా ప్రజల్లో మాత్రం చాలఅలజడిగా వున్నది. అదే నిజమైతే చాలామంది తాము వేసినచందాలు ఇవ్వటం మానివేస్తామని అను కోటం మాత్రం విన్నాను.

రాజా:— అలా జరకటానికి వీల్లేదు.

జగ:— ఎందుకు జరగదు? వాళ్ళు చందాలు ఇస్తున్నారంటే ఏదో కొంత లాభం ఆశించే ఇవ్వటానికి సిద్ధపడుతున్నారు.

రాజా:— పొరపాటు. మనసంఘం అంత అధోగతికి పోలేదనుకుంటాను.

జగ:— నీవు బొత్తిగా అమాయకుడవురాజా. అందరు నీమాదిరిగా బుద్ధి మంతు లనుకుంటున్నావు. ఈ విషయంలో నీకంటే నాకే ఎక్కువ అనుభవం వుందని మాత్రం నేను గట్టిగా చెప్పగలను. ఈ టవున్‌లో కేవలం అదర్శంకోసం పాటుబడేవ్యక్తి మనంగాక మరొకవ్యక్తి లేడంటే నమ్ము. (బయట వరండాలోకి వెళ్ళుతూ) వుష్! అదుగో వాళ్ళొస్తున్నారు.

రాజా:— (బయటికివస్తూ) ఎవరు ?

జగ:— మన అమెరికా మిత్రులిద్దరు. వాళ్ళవెంట 'ఇండియన్‌గరల్' కెప్టెన్‌కూడా వున్నాడు. వుష్!

రాజా:— అతనితో వాళ్ళకేమిపని ?

జగ:— పనేముంటుంది? ఒకరకం వాళ్ళంతా ఒకచోట చేరటంసహజం. అతన్ని చూస్తుంటే నాకు ఎందుకో దోపిడీవాణ్ని, మనుష్యుల్ని పట్టుకొని వచ్చి అమ్ముకునేవాణ్ని చూసినట్టుగా వుంటుంది— కొంపదీసి మనవాళ్ళిద్దరు కూడా అవృత్తి చేస్తున్నారేమో ? అదుగో వాళ్ళిద్దరూ మళ్ళీ వెనక్కు వెళ్ళుతున్నారు. శోభ ఒక్కతే వస్తుంది.

రాజా:— జగదీశ్! నీవు వాళ్ళవిషయంలో అలా అభిప్రాయపడటం చాలాపొరపాటు.

జగ:— రాజా! నీవు బుద్ధిమంతుడవు కనుక అందరూ నీకు బుద్ధి మంతులుగానే కనబడాతారు. ఏపుట్టలోఏపాముంటుందో చెప్పలేము- వస్తుంది. నేను లోపలికి వెళ్ళుతా.

(జగదీశ్ గదిలోకి వెళ్ళబోతూ వుంటాడు. శోభాదేవి ముందుగా వస్తుంది)

శోభా:— ఓహ్! జగదీశ్! నన్నుచూచి పారిపోతున్నావా!

జగ:— లేదు. లేదు. కమలాదేవితో కొంచెం మాట్లాడాలి. అందుకని. (లోపలికి వెళ్ళిపోతాడు)

రాజా:— (కొంచెంసేపున్న తరువాత) శోభా!

శోభా:— ఆఁ.

రాజా:— ఇవాళ నన్నుగురించి ఏమనుకుంటున్నావు ?

శోభా:— నిన్న ఏమనుకున్నానో అదే. కేవలం అసత్యవాదివని.

రాజా:— శోభా! నీతో మరికొన్ని విషయాలు చెప్పటం అవసరం.
బాబూరావ్ ఎక్కడికి వెళ్ళాడు?
శోభా:— ఇప్పుడే వస్తాడు. ఒకమనిషితో మాట్లాడుతున్నాడు.
రాజా: — నిన్న నేను చెప్పినది విన్నావు. ఈ రహస్యం బయటపడితే నా జీవితమంతా నాశనం అవుతుంది.
శోభా:— అవును. నాకుతెలుసు.
రాజా:— 'రీజన్' ప్రకారం ఆలోచిస్తే టవున్‌లో బాబురావును గురించి అనుకుంటున్న నేరానికి నేను బాధ్యుణ్ని కాదు.
శోభా:— రీజన్‌ప్రకారం? కాని అసలు దొంగ ఎవరు?
రాజా:— అసలు దొంగ ఎవరూ కాదు. డబ్బుఎవరూ అపహరించలేదు-ఒకకానీకూడా.
శోభా:— నిజమా?
రాజా:— ముమ్మాటికీ నిజం. ఒకకానీ కూడా పోలేదు.
శోభా:—అయితే టవున్‌లో దొంగతనం జరిగిందని అనుకోటం?
రాజా:— శోభా! నీముందు నేనేమీ దాచదలచలేదు. అలా అనుకోటానికి కొంతనేనే—
శోభా:— నీవా? నీకోసం త్యాగంచేసిన వ్యక్తినిగురించి నీవు—
రాజా:— విషయమంతా తెలుసుకోకుండా నీవు నన్ను అనటం బాగోదు. నిన్న నీతో చెప్పాను. నేను పారిస్‌నుంచి ఇంటికి వచ్చేటప్పటికి ఇక్కడ వ్యాపారమంతా తలక్రిందులైంది. అమ్మ దివాళాతీసే పరిస్థితిల్లో వుంది. అప్పులవాళ్ళు చుట్టూ మూగసాగారు. నాకేమీ తోచలేదు. కుటుంబం నిలపటానికి, కుటుంబగౌరవం కాపాడటానికి ఒక మార్గం కనిపెట్టవలసివచ్చింది. మీరు అమెరికా వెళ్ళటంతో—
శోభా:— ఆఁ.
రాజా:— జనం మమ్మల్నిగూర్చి రకరకాలగా అనుకోటం సాగించింది. కొంతమంది నేను రాంభాయికి డబ్బుయిచ్చానని, మరికొంతమంది నేను రాంభాయి భర్తకు లంచంయిచ్చి అతనినోరు కట్టివేసి పంపించానని అనుకోసాగారు. దాంతో మాపరువు ప్రతిష్టలన్నీ దెబ్బతిని

అప్పులవాళ్ళు ఆగేటట్లు కనబడలేదు. మీరు అమెరికావెళ్ళటంవల్ల బాబూరావ్ డబ్బుకూడా అపహరించి పారిపోయాడనే అనుమానం కూడా కొంతమందికి లేకపోలేదు. దాన్నే యథార్థం—

శోభా:— నీవు—?

రాజా:— నీటిలో మునిగిపోయేవ్యక్తికి చెట్టుకొమ్మ దొరికినట్లు నాకది సహాయభూతమయింది.

శోభా:— అందుకని దాన్నే నీవు ఎక్కువ వ్యాప్తికావటానికి తోడ్పడ్డావు.

రాజా:— నీ అభిప్రాయం కాదనను. అప్పులవాళ్ళు మా యింటిమీద దండెత్తారు. దురదృష్టంవల్ల ఇనపపెట్టెలో డబ్బుపోయిందని, కొంత కాలం ఆగమని వారికి నచ్చచెప్పగలిగాను. దాంతో వారుకూడ కష్టంలో వున్నవారిని వొత్తిడి చేయగూడదని ఆగటం, తరువాత వారికి పూర్తిగా బాకీలు చెల్లించటం జరిగింది.

శోభా:— బాకీలు పూర్తిగా చెల్లించావు.

రాజా:— ఆఁ. బాబూరావుమీద వేసిన నీలాపనిందవల్ల నాకుటుంబం రక్షించబడ్డది. నేను సంఘంలో గౌరవంపొంది ప్రస్తుతవ్యక్తిని కాగలిగాను.

శోభా:— అంటే ఒక అసత్యాన్ని వ్యాపింపచేసి నీవు ప్రస్తుతవ్యక్తివి కాగలిగావన్నమాట.

రాజా:— నేను నిజంగా ఎవరినీ నష్టపరచలేదు. అప్పుడు బాబూరావు మళ్లీ తిరిగి యిక్కడకు రాననే చెప్పివెళ్ళాడు.

శోభా:— నీవు ఎవరినీ నష్టపరచలేదా ? ఇదేప్రశ్న నీహృదయాన్ని అడిగి సమాధానం చెప్పమను.

రాజా:— నీకిష్టమయిన ఏ హృదయాన్నయినా పరీక్షించి చూడు. అతనిలో ఎక్కడో ఒకచోట ఏదో వొకవిధమయిన 'నల్లనిమచ్చ' కనపడక మానదు, దాన్ని అతడు రహస్యంగా దాచుకుంటూనే వుంటాడు.

శోభా:— నీవు సంఘనాయకుడినని చెప్పుకుంటావు.

రాజా:— మొత్తం సంఘమే అలావున్నది.

శోభా:— అలాంటి సంఘం వున్నావొకటే, లేకపోయినా వొకటే. లోపల కుళ్లు- పైపై మెరుగులు. అంతకంటే సంఘంలో కనపడేదిలేదు. అందుకు ఉదాహరణంకోసం ఎక్కడికో పోనక్కర్లేదు. నీవేచాలు. టవున్‌లో నీవు ప్రధానవ్యక్తివి. పలుకుబడి, గౌరవం కలవాడవు. ఆదర్శప్రాయుడవు. అలాంటి నీవే ఒక అమాయకవ్యక్తిని, నిర్దోషిని దొంగగా, నేరస్థుడిగా చలామణి చేయించావు.

రాజా:— దానికి నేను బాధపడటంలేదనా నీ అభిప్రాయం ? దాన్ని సవరించుకోటానికి నేను సిద్ధంగా వున్నాను.

శోభా:— ఎట్లా ? యదార్థం బయటపెట్టేనా ?

రాజా:— అందుకు నీవు బలవంతపెట్టవద్దు శోభా !

శోభా:— అయితే మరి నీతప్పును ఎలా సవరించుకోగలుగుతావు ?

రాజా:— శోభా ! ఇప్పుడు నాదగ్గర కావలసినంత ధనంవున్నది. బాబూరావ్ ఎంతఅడిగితే అంతఇవ్వటానికి సిద్ధంగా వున్నాను.

శోభా:— ధనమా ? బాబును లంచంయిచ్చి కొనాలనుకుంటున్నావా ? రాజా ! నీఔదార్యం మెచ్చుకోదగ్గది.

రాజా:— అయితే ఏంచేయమంటావు ?

శోభా:— అడుగో ! బాబువస్తున్నాడు. అతన్నే అడిగి తెలుసుకో.

(బాబూరావు వస్తాడు. రాజారామ్ అతనికి ఎదురుగా వెళ్ళి భుజంమీద చేయి వేస్తాడు.)

రాజా:— బాబూరావ్ !

బాబూ:— (రాజారామ్ చేయి తీసివేస్తూ) నిన్న అవిషయాన్ని గురించి ఏమీ బయటపెట్టనని అన్నాను. కాని తరువాత నేను విన్నదానినిబట్టి-

రాజా:— నేను ముందు అసలు పరిస్థితులు చెప్పినతరువాత—

బాబూ:— నాకు అన్నీతెలుసు. నీవుచెప్పటం అనవసరం. అప్పుడు నీవు, నీవ్యాపారం, నీకుటుంబం దివాళాతీసే పరిస్థితుల్లో వున్నవి. నేను లేక పోటంచేత నామీద నేరం అంతావేసి నీవు బయటపడ్డావు. అందుకు నేను విచారపడటంలేదు. అప్పుడు మనం కుర్రవాళ్ళం కనుక ఏదో

తోచింది చేసాము. కాని యిప్పుడు నాకు నీవు నోరువిప్పి సత్యం బయట పెట్టాలి.

రాజా:— ఇప్పుడు ? ఈపరిస్థితుల్లో అసలు రహస్యం బయటపెట్టితే నా గౌరవంఅంతా మట్టిపాలవుతుంది. అది నేను చేయలేను, చేయను.

బాబూ:—నేనుకోరేది అదికాదు, మరొకటి. నేను వాసంతిని పెండ్లిచేసుకో వాలనుకుంటున్నాను. పెండ్లిచేసుకొని ఇక్కడే, ఈ టవునులోనే వుండిపోదామను కుంటున్నాను.

శోభా:—నీవు కోరేది అంతేనా ?

రాజా:—వాసంతితోనా పెండ్లి?—ఇక్కడేనా?

బాబూ:—అవును. వాసంతితో, ఇక్కడే. ఈ టవున్‌లోనే.

రాజా:—బాబూరావ్! శోభా! నీవుకూడవిను. ప్రస్తుత పరిస్థితుల్నిబట్టి, ఇక్కడ ఈ సంఘంలో నేను అలాంటికార్యానికి అంగీకరించి తోడ్ప డితే పదిమందిలో నేను తలెత్తుకుతిరగటానికి వీల్లేదు. నా పరువు మర్యాదలుండవు. నీవు బలవంతపెట్టి నాచేత యీకార్యం చేయించ వద్దు. దీనివల్ల నాజీవితం, నాభవిష్యత్తు, ఇంకా అనేకం ధ్వంసంకాక తప్పదు, మరిఇంకా—

బాబూ:—నేను నిన్ను యీ విషయంలో బలవంత పెట్టకపోతే నా చేతులతోనే నా భావిజీవిత సుఖాన్నంతటినీ పాడుచేసుకోవటం జరుగు తుంది.

శోభా:—రాజారామ్ ! ఇంకా ఏంటి? చెప్పు.

రాజా:—వినండి చెపుతా. ఇందులో రైల్వేస్కీముకూడా ఇమిడివున్నది. అది మీరనుకున్నంత తేలిక విషయంకాదు. మీరు వినేవుంటారు. గతసంవత్సరం సముద్రపుఅంచునే రైల్వేలైను వేయాలని ఒకప్రపో జల్‌వచ్చింది. దాన్ని టవున్‌లో పెద్దవాళ్ళంతా బలపర్చారు. కాని దాని వల్ల 'స్టీమ్‌బోటుసర్వీసు'కు దెబ్బతగులుతుందని ఆ ప్రపోజల్ ఏదో వొకవిధంగా లేకుండా చేశాను.

శోభా:—'స్టీమ్‌బోటుసర్వీసు'లో నీకుకూడా వాటాలున్నవా ?

రాజా:—అవును. కాని అవిషయం ఇతరులకు తెలియదు. అందుకని ఆ రైల్వేస్కీము మాన్పించి యీ ప్రపోజలు పెట్టి నెగ్గింపచేశాను. తరువాత మరొక రహస్యంకూడా వున్నది. అది ఇంతవరకు నాలోనుంచి బయటకు వెళ్ళలేదు. ఈలైను పడినతరువాత అక్కడనుంచి యీ టవునుకు బ్రాంచిలైను వేయించాలని ప్లానువేసుకున్నాను.

శోభా:—ఇది దాచవలసిన అగత్యం ఏంటి ?

రాజా:—ఉన్నది. మీరువినేవుంటారు, ఈ మధ్యలోవున్న అడవులు, ఖనిజ భూములు ఎవరో కొనివేస్తున్నారని.

బాబూ:—అవును ఎవరో కంపెనివాళ్ళు కొంటున్నారని చూచాయగా విన్నాము.

రాజా:—ప్రస్తుతానికి వాటివల్ల ఫలసాయం లేకపోవటంచేత అవి 'వేస్టుల్యాండ్సు'గా పడివున్నవి: బ్రాంచిలైను పడినతరువాతకాని వాటి విలువ తెలియదు. అప్పుడు ఆభూముల యజమానులు వాటిధరలు తప్పకుండా పెంచివేస్తారు.

శోభా:—కావచ్చు. అయితేయేం ?

రాజా:—అందుకనే ముందుగా ఆభూములు కొనటం జరిగింది.

శోభా:—నీ స్వంతానికేనా ?

రాజా:—అవును. బ్రాంచిలైనుపడితే నేనుకోటీశ్వరుడినిఅవుతానన్నమాటే. కాకపోతే మొత్తం తలక్రిందులౌతుంది. నాఆస్తినంతా ఇందుకోసం వెచ్చించాను.

శోభా:—ఈ రహస్యం బయటపడితే.

రాజా:—తరువాత బయటపడకమానదు. కాని నాకు ధైర్యంవుంది. సంఘంకోసం, సంఘాభివృద్ధికోసం భూమిలోవుండే ఖనిజపదార్థాలు బయటికి లాగటానికి, భూమిని ఫలవంతం చేయటానికి యీపని చేశానని నమ్మించగలను.

శోభా:—ప్రజలనా?

రాజా:—అవును. యేవొక్కవ్యక్తి నన్నుగురించి, నా ఆదర్శాలనుగురించి సందేహించడు.

శోభా:—అయితే ఇందులో వ్యవహరించే తక్కినవాళ్ళే నీకంటె బుద్ధి మంతులన్నమాట? వారు ఇలాంటిస్వార్థంతో చేయుటంలేదు.

రాజా:—ఎవరు ?

శోభా:—విశ్వేశ్వర్రావు, గుణచంద్, కృష్ణపిళ్ళె మొదలైనవ్యక్తులు.

రాజా:—నాకు తోడుగావుంటానికి వచ్చేలాభాల్లో ఐదోవంతు వారికిస్తానని వాగ్దానం చేశాను.

శోభా:—ఓహో? మీరంతా సంఘనాయకులు ?

రాజా:—ఈ సంఘ పరిస్థితులవల్లనే మేము ఈవిధంగా చేయవలసి వస్తుంది. నేను యీ విషయంలో రహస్యంగా వ్యవహరించకపోతే బయటవాళ్లువచ్చి ఎగబడటం, పోటీలు పడటం, ధరలు పెరగటం, చివరకు ఎవరో బయటివాళ్ళేకొని లాభాలు చేపట్టటం జరిగేది. ఈ ప్రాంతంలో నేనులేకపోతే యింత పెద్దవ్యాపారం యీసంఘంలోనడిపే వ్యక్తి మరొకడులేడు. భూములన్నీ వృథాగాపడి వుండవలసివచ్చేది.

శోభా:—అవును.

బాబూ:—సంఘంకోసం నాజీవితసుఖాన్ని వదలుకోటానికి, నా జీవితం నాశనం చేసుకోటానికి నేను సమ్మతించను.

రాజా:—సంఘశ్రేయస్సుగూడ నీవుగమనించాలి. నా బాల్యజీవితంలోని అఘట్టం బయటపడితే దాన్ని ఆసరాగా తీసుకొని నన్ను నాశనంచేయు టానికి ఎంతోమంది పూనుకుంటారు. యీసంఘం వ్యక్తిలో ఏ మాత్రం కలుషమున్నా—అదితెలియక లేక తప్పనిసరిఅయిచేసినా— సహించదు. నాకైర్యేస్కీము అంతా భగ్నంఅవుతుంది. నేనికవ్యక్తిగా పరిగణింపబడను. నేను చేయగలిగేది, చేసేదివుండదు. సంఘం ముందుకు పోలేదు.

శోభా:—బాబూ! రాజారామ్ చెప్పింది విన్నావు. అయిందేదో అయిపో యింది. ఇక అవిషయం మరచిపోయి నీవు ఇక్కడనుంచి వెళ్ళిపోవ టం మంచిది.

రాజా:—అవును. బాబురావ్! నీవు ఇక్కడనుంచి త్వరగా —

బాబూ:—నేనువెంటనే వెళ్లిపోతాను. నేనీరహస్యం బయటపెట్టను—
మళ్ళీనేను తిరిగివస్తాను అప్పుడైనా నీవు—

రాజా:—అక్కడేవుండు. నీవుకావాలంటే కావలసినడబ్బు—

బాబూ:—నాకు కావలసింది డబ్బుకాదు. నేనుకోల్పోయిన పేరు ప్రతిష్ఠలు, గౌరవం నాకు కావాలి,

రాజా:—నన్ను త్యాగం చేయమంటావు.

బాబూ:—నీవు, నీసంఘం చేయవలసింది అదే — నేను వాసంతిని తప్పకుండా. పెండ్లిచేసుకుంటాను. అందుకోసం రేపే 'ఇండియన్ గరల్'లో అమెరికా వెళ్ళిపోతున్నాను.

రాజా:—'ఇండియన్ గరల్'లోనా?

బాబూ:—అవును. అమెరికావెళ్ళగానే అక్కడి నాభూములన్నీ అమ్మివేసి, వ్యవహారాలన్నీ చక్కపెట్టుకొని రెండునెలల్లో తిరిగివస్తాను.

రాజా:—అప్పుడు నీవు మాట్లాడుతావా ?

బాబూ:—నేరం చేసినవ్యక్తి నేరంచేసినట్లు వొప్పుకోవాలి.

రాజా:—ప్రజలు అనుకునేదానికి పూర్తిబాధ్యత నాదేననా నీఅభిప్రాయం?

బాబూ:—ఈ పదిహేను సంవత్సరాలనుంచి దానివల్ల లాభించినదెవరు?

రాజా:—నీవు ఏదిచెప్పినా ప్రజలునమ్మరు. నామీదగిట్టక నీవుఅలాచెప్పుతున్నావంటే ప్రజలు నామాటే నమ్ముతారు.

శోభా:—ఛీ !

రాజా:—నేను అవసరంవస్తే ఎలాగయినా చేయగల సాహసం నాలో వుంది. నీవుచెప్పే ప్రతివిషయం నూటికి నూరుపాళ్ళు అబద్ధం అని నేను అందరినీ నమ్మించగలను.

బాబూ:—నీవు మరచిపోయావా? నీవువ్రాసిన ఉత్తరాలు రెండు నాదగ్గర వున్నవి.-అవి ఇక్కడ నాపెట్టెలోనే వున్నవి. ఇవాళ తిరిగివాటిని చదివాను. అందులో స్పష్టంగా కనబడుతుంది.

రాజా:—వాటిని నీవు బయటపెట్టుతావా ?

బాబూ:— అవసరం వస్తే.

రాజా:—నీవు తిరిగి రెండునెల్లకు వస్తావా ?

బాబూ:—అను కుంటున్నాను. ఏమో! 'ఇండియన్‌గరల్' సరిగా ప్రయాణంచేస్తే. లేకపోతే.

రాజా:—అంటే.

బాబూ:—అంటేనా, అదృష్టం బాగోకపోతే మునిగిపోవచ్చు.

రాజా:—(పెద్దగా) మునిగిపోవటమా ?

బాబూ: -రాజారామ్! అన్నీ మాట్లాడుకున్నాము. నీకు ఏదిమంచిదో ఆలోచించుకో. గుడ్‌బై. కమల ఎందుకో నామీద అయిష్టంగావున్నది. అయినా ఆమెకుగూడా నా గుడ్‌బై అందించు—వనకుమారి ఎక్కడ వుంది? ఆమెతో మాట్లాడాలి: వాసంతి విషయం ఆమెతోచెప్పి వెళ్ళాలి. (లోపలికి వెళ్ళుతాడు.)

రాజా:—(తనలో) 'ఇండియన్ గరల్'—? (త్వరగా) శోభా! వెళ్ళి వద్దనిచెప్పు.

శోభా:—నీవే చెప్పటంమంచిది. ఇప్పుడు నామాటఅంతగా వినటంలేదు. (బాబూరావు వెళ్ళినవైపుకే వెళ్ళుతుంది.)

రాజా:—మునిగిపోతుందా—?

(శ్యామలరావు వస్తాడు.)

శ్యామ:—బాబూ !

రాజా:—(కోపంతో తీక్షణంగా అతనివంకచూస్తూ) ఏంటి ?

శ్యామ:—క్షమిస్తే మిమ్మల్ని ఒకమాట—

రాజా:—త్వరగా. ఏంటది?

శ్యామ:—'ఇండియన్ గరల్' రేపటికి పూర్తికాకపోతే మీరునన్ను ఉద్యోగంనుంచి—

రాజా:—ఆఓడ పూర్తిఅయిందిగా.

శ్యామ:—అవును పూర్తిఅయింది.—ఒకవేళ కాకపోతే మీరునన్ను ఉద్యోగంనుంచి తొలగిస్తారా ?

రాజా:—నీప్రశ్ననాకు అర్థంకావటంలేదు శ్యామలరావు.

శ్యామ:—వూరికే తెలుసుకోవాలని అడుగుతున్నానండీ. నన్ను మీరు పనినుంచి తొలగిస్తారా ?

రాజా:—నాకు రెండునాలుకలులేవు. అన్నమాట చలామణి కాకతప్పదు.

శ్యామ:—నా ఉద్యోగంపోతే నాజీవితం, నాపిల్లల జీవితం, నాకుటుంబ జీవితం, నామీద అధారపడి పనిచేసే బీదసాదల జీవితం నాశనం అవుతుంది.

రాజా:—దాన్నిగురించి మనం ఇదిపరకే మాట్లాడుకున్నాం. మళ్ళీ అనవసర చర్చదేనికి ?

శ్యామ:—అవును. రేపు 'ఇండియన్ గరల్' ప్రయాణానికి సిద్ధంగా వుంటుంది.

రాజా:—శ్యామలరావూ! నాకు ప్రతిచిన్నవిషయం చూడటానికి తీరిక వుండదు. అనేక పనులుంటై. —'ఇండియన్ గరల్' రిపైర్సుచక్కగా చేశావా ?

శ్యామ:—మీరిచ్చిన టైము చాలాతక్కువ.

రాజా:—నేను అడుగుతున్నది రిపైర్సు చక్కగా చేశావా అని.

శ్యామ:—వాతావరణం బాగానే ఉన్నది. పైగా ఇది వేసవికాలం.

రాజా:—(విసుగుగా) ఇంకేమైనా నాతో మాట్లాడవలసింది వున్నదా ?

శ్యామ:—ఏమీలేదండీ.

రాజా:—సరే—'ఇండియన్ గరల్' ప్రయాణం ?

శ్యామ:—రేపు ?

రాజా:—అవును.

శ్యామ:—ఆఁ.

(శ్యామలరావు బయటకి వెళ్ళిపోతాడు. రాజారామ్ కొంచెంసేపు అటూ, ఇటూ చూచి శ్యామలరావును పిలవాలనే వుద్దేశంతో వాకిలిదగ్గరకువెళ్ళి మళ్ళీ ఆగుతాడు. నటేశం లోపలికి వస్తాడు.)

నటే:—(మెల్లగా) ఒప్పుకున్నాడా మీదగ్గర ?

రాజా:—నీవు ఏదైనా కనిపెట్టావా ?

నటే:—అంతశ్రమ దేనికండీ? అతని ముఖంచూస్తేనే లోపలవున్న కుట్ర కనబడుతుంది.

రాజా:—అలా అంటే నేను ఒప్పుకోను. నీవేదైనా అతనిమోసాన్ని గురించి రుజువు చూపగలిగితే చూపు.

నటే:—అలా అడిగితే ఇప్పుడు నేనేమీ చూపలేను. వాళ్ళు ఓడ సముద్రం లోకి తోసివేసారు. వాళ్ళు తొందరపడి సముద్రంలోకి ఓడనునెట్టటమే

రాజా:—అది రుజువుకాదు. ఓడ వదిలేముందు ఇన్స్పెక్షన్ జరిగిందా?

నటే:—ఆఁ. కాని·—

రాజా:—ఇన్స్పెక్టరునుంచి ఏమీ రిమార్కు లేదు ?

నటే:—రాజారామ్‌గారూ ! ఇన్స్పెక్షన్ అంటే మీకు తెలియందిలేదు. అందులో మంచి పేరువున్న మనవర్కుషాపులాంటి దానిలో—

రాజా:—ఏమీ ఫరవాలేదు. నీఅనుమానం సరైందికాదు నటేశం.

నటే:—మీరు శ్యామలరావు ముఖాన్నిబట్టి ఏమి వూహించలేదా ?

రాజా:—శ్యామలరావు పూర్తిగానాకు సమ్మకం కలిగించాడు.

నటే:—కాని నాకుమాత్రం అనుమానంగానే వున్నది.

రాజా:—నటేశం! నీమాటలు వింటుంటే నీవు కేవలం అతనిమీద ఏదో ద్వేషంపెట్టుకొని మాట్లాడుతున్నట్టుంది. నీకు ఆతనిమీదవున్న కసి తీర్చుకోవాలంటే మరొకవిధంగా తీర్చుకోటం మంచిది—నీకుతెలుసు రేపు 'ఇండియన్ గరల్' తప్పక బయలుదేరాలని.

నటే:—అవును. కాని మళ్ళీ అఓడనుమనం చూస్తామా అనేదే నాప్రశ్న.

(గుణచంద్ వస్తాడు)

గుణ:—నమస్కారం రాజారామ్‌గారూ ! ఒకనిముషం నాకోసం వినియోగిస్తారా ?

రాజా:—మీరుప్పన్నంతసేపూ. ఏంటి గుణచంద్‌గారూ ?

గుణ:—'పామ్‌ట్రీ'ని కూడా రేపు బయటకు పంపగలరా. అని తెలుసుకోటానికి వచ్చాను.

రాజా:—తప్పకుండా, తప్పకుండా. అందులోమీరు సందేహపడనక్కర్లేదు.

గుణ:—ఇప్పుడే కెప్టెన్ నాదగ్గరకువచ్చి వెళ్ళాడు. తుఫాన్ సిగ్నల్ ఇచ్చినట్లు చెప్పాడు.

రాజా:—తుఫాన్ వస్తుందా ? మరి మీ 'పామ్‌ట్రీ' ప్రయాణం ?

గుణ:—'పామ్‌ట్రీ' వెంటనే ఇంగ్లండువెళ్ళాలి. ఇప్పటికే ఆలస్యమయింది తప్పదు. అంతా దేవునిమీద భారం వేస్తున్నాను — అయినా భయంలేదు. ఇన్స్యూరెన్సు ఇదివరకే చేయించాను. 'ఇండియన్‌గరల్' కూడా రేపే బయలుదేరుతుందికదూ? అది చాలా పాతబడిపోయింది. అమెరికా చేరటం అనుమానాస్పదమే.

రాజా:—వాళ్ళుగూడా తొందరపడుతున్నారు.—మీలెక్కలు చూచుకుంటారా? –నటేశం ! వీరిని ఆఫీసుగదికి తీసుకొనివెళ్ళి వీరిలెక్క చూపించు.

(ఇద్దరూకలసి లోపలికివెళ్ళుతారు. వివేకానందుడు తోటలోపలనుంచి వస్తాడు. రాజారామ్ ఆలోచనలో వుంటాడు.)

వివే:—నమస్కారం రాజారామ్‌గారూ ! ఏదోదీర్ఘంగా ఆలోచిస్తున్నట్లున్నారే. మీముఖంఎందుకో అదొకతరహాగా విచారంగావున్నట్లు కనబడుతుంది.

రాజా:—నాముఖమా? నిజంగానా?—కావచ్చు. నాలాంటివ్యక్తికి అనేక ఆలోచనలు అనేక బాధ్యతలు వుండకతప్పదు నావ్యాపారంతో నాకు క్షణంతీరిక వుండటంలేదు. పైగా యిప్పుడు యీరైల్వేస్కీము గొడవ. వివేకానందుడుగారూ! మిమ్మల్ని ఒకప్రశ్నఅడిగి సమాధానం తెలుసుకోవాలనుకుంటున్నాను.

వివే:—సంతోషం.

రాజా:—నాకు ఒకఆలోచనతట్టింది. సంఘంకోసం ఒకపెద్ద బాధ్యతను నెత్తినవేసుకున్నవ్యక్తి దాన్నిగురించి ఒకట్టి ఆహుతి చేయవలసివస్తే.

వివే:—మీ వుద్దేశం ?

రాజా:—ఒకవ్యక్తి పెద్దఫ్యాక్టరీ పెట్టాలనుకుంటాడు. అతడు తన అనుభవంవల్ల ఆఫ్యాక్టరీ పనిచేయటంలో ఒకవ్యక్తిజీవితం కోల్పోవలసి వస్తుందని గ్రహిస్తాడు.

వివే:—అలాంటిది జరగవచ్చు.

రాజా:—ఒకవ్యక్తి గనులపరిశ్రమ భారీగా ప్రారంభిస్తాడు. అందులో పనిచేసేవాళ్ళల్లో కొంతమంది దురదృష్టవశాత్తు ప్రాణాలుకూడా కోల్పోవచ్చు.

వివే:—అవును.

రాజా—అలాగే ఒకవ్యక్తి భారీగా ఒకవరిశ్రమ ప్రారంభించాలనుకుంటాడు. దానిలో ఎప్పుడోఒకప్పుడు కొంతమంది జీవితాలు కోల్పోవలసి వస్తుందని అతనికితెలుసు. కానిఅది సంఘాభివృద్ధికి. సంఘ శ్రేయస్సుకు అవసరం.

వివే:—ఓహో! మీరు రైల్వేస్కీమునుగురించి ఆలోచిస్తున్నారేంటి ?

రాజా:—అవును. రైల్వేలైను పడటంతో అనేకఫ్యాక్టరీలు, గనులు ప్రారంభించటంకూడా జరగవచ్చు. కాని

వివే:—మీరు ఎక్కువగా ఆలోచిస్తూవుంటారు. మనంచేసేప్రతిపనీ భగవంతునిమీద భారంవేసి చేయాలి.

రాజా:—అవును. నేనూ అదేఅనుకుంటున్నాను.

వివే:—రాజారామ్‌గారు! అలాంటప్పుడు ఎవరూ మిమ్మల్ని వేలుపెట్టి చూపించలేరు. మీరనుకున్నరైల్వేస్కీము ధైర్యంగానే ప్రారంభించండి

రాజా:—మిమ్మల్ని మరొకవిషయంగూడా అడుగుతున్నాను. ఈరైల్వేలైను పూర్తిచేయాలంటే మధ్యలో ప్రమాదభరితమైన ఒక కొండప్రదేశం అడ్డంవస్తుంది. దాన్ని తొలగించాలంటే తుపాకిమందుపెట్టి పగలగొట్టవలసి వుంటుందని ఇంజనీయిరు చెపుతాడు. అమందుపెట్టి వెలిగించివచ్చే కూలివాడు తిరిగిరాకముందే అకొండ పగలటం, వాడుచావటం, జరుగుతుంది. అలాంటప్పుడు అతనిని పంపటమా. మానివేయటమా ?

వివే:—ఆc.

రాజా:—నాకుతెలుసు మీరేమి సమాధానమిస్తారో. అయింజనీయిరే స్వయంగావెళ్ళి అగ్గిపుల్లవెలిగించి ముట్టించిరావటం అసంభవం కనుక ఒకకూలివానిని అందుకోసం ఆహుతి చేయవలసిందేనని మీరుచెపుతారు. అవునా?

వివే:—ఇక్కడ మనదేశంలో ఏ ఇంజనీయరు అలాంటిపని చేయించడు.
రాజా:—పాశ్చాత్యదేశాల్లో ఇలా ఆలోచించిరు.
వివే:—వాళ్ళకు పాపపుణ్యాలంటే లెక్కలేదు కనుక.
రాజా:—అలా త్రోసివేయటం మంచిదికాదు. అక్కడనుంచి మనం నేర్చుకోవలసిన విషయాలుగూడా కొన్నివున్నవి.
వివే:—దీన్ని మీరుఅంగీకరిస్తారా? మీరు—
రాజా;—ఆదేశాలలో ఒకవ్యక్తి ఒక పెద్దప్రాజెక్టు నిర్మాణానికిపూనుకుంటాడనుకో. దానివలనదేశానికి చాలామేలు జరుగుతుంది. కాని ఆనిర్మాణంలో కొన్ని ప్రాణాలుగూడా పోవచ్చు. అయినా దేశసౌభాగ్యం ముందు వాటిని పరిగణించడు—కాని ఇక్కడ ప్రతిదాన్ని మనం అనవసరంగా తర్కిస్తూ అసలు ఆదర్శాన్ని జారవిడుస్తాము.
వివే:—ప్రాణం మీకంత తేలిగ్గా కనబడుతుందా ?
రాజా;—ఒకప్రాణం వేలకొలది ప్రాణులు సుఖానికి ఆటంకం అవుతుంది
వివే:—మీరుచెప్పేవి వూహకుఅందని విషయాలు, ఎందుకో మీరుఇవాళ కొత్తగా మాట్లాడుతున్నారు —ఆదేశాలలో మానవజీవితంమీద వాళ్లకు గౌరవంలేదు. ప్రతిదీ వారుడబ్బుతోనే కొలుస్తూవుంటారు. కాని ఇక్కడ మనం చూసేది ధర్మం, న్యాయం, నీతిమొదలైనవి. ఇక్కడ మన నౌకానిర్మాణ పరిశ్రమల్ని చూడండి: ఎచ్చటైనా, ఎవరైనా డబ్బుకోసం ప్రాణాలు తీస్తున్నారేమో. అచ్చట అలాకాదు, వాళ్ళు కేవలం డబ్బునే ప్రధానంగా పెట్టి ఓడలు తయారుచేస్తారు. అవి సక్రమంగా వున్నవీ, లేనిదీ వారికనవసరం. సముద్రంలో మునిగిపోయినా, దానివల్ల ప్రయాణీకులు చచ్చిపోయినా వాళ్లకు లెక్కవుండదు. వాళ్లు చూసేది వోడవెంటవోడ తయారు అనిపించి బయటకు నెట్టటము.
రాజా —నేనుమాట్లాడేది వోడలవిషయంకాదు.
వివే;—అవును. కాని నేను మాటలాడేదిగూడా మీరుగమనించాలి.
రాజా:—దానివల్ల ప్రయోజనం శూన్యం. నాప్రశ్నకిది సమాధానంకాదు. మనదేశంలో మీరు చెప్పినప్రకారంఅయితే ఒకకమాండరు యుద్ధభూమికి తీసుకొనివెళ్ళిన సైనికుల్లో కొంతమంది చనిపోతే వారికోసం

నిద్రాహారాలులేక ఏడుస్తూకూర్చోవాలి. అక్కడ అలాకాదు.-అదుగో లోపలగదిలో అతనేమంటున్నాడో విను.

వివే:—అతడిక్కడేవున్నాడా? చెప్పరేంమరి? నేను వెళ్ళిపోతాను.

రాజా:—మీరుండాలి.

(బాబురావు గదినుంచి బయటికి వస్తాడు)

బాబూ:—(గదిలోవున్న వాసంతితో) అవును వాసంతీ! నీ యిష్టప్రకారమే కానివ్వు. కాని నిన్నుమాత్రం నేను వదలిపెట్టను. నేను మళ్ళీ వెంటనే తిరిగివస్తాను. అప్పుడు మనయిద్దరిమధ్యా యీ అభిప్రాయ భేదాలుండవు,

వివే:—క్షమించండి. మీరనేది ఏంటి?

బాబూ:—నేననేదా, నిన్న మీరు నన్ను ఆ పిల్లముందు నాజీవితాన్నిగురించి అసభ్యంగా మాట్లాడారే-ఆపిల్లను నేను భార్యగా స్వీకరించబోతున్నాను.

వివే:—భార్యగానా? మీకు నిజంగా అలాంటి అభిప్రాయం—?

బాబూ:—అంటే నేను ఆమెను పెండ్లిచేసుకోవాలను కుంటున్నాను.

(లోపలనుంచి కమలాదేవి, వనకుమారి వస్తారు.)

వివే:—ఏమండీ? మీకుకూడా యిదియిష్టమేనా? వాసంతి! ఇటురా. (వాకిలిదగ్గరకు వస్తాడు. శోభ నిలబడివుంటుంది.) ఓహో! మీరుకూడా వున్నారా?

శోభా:—నన్నుకూడా రమ్మంటారా ?

(శోభా, వాసంతి, బయటికివస్తారు. జగదీశ్ కూడా అప్పుడే వస్తాడు.)

కమ:—వివేనందుడుగారూ! నేను శతవిధాలా చెప్పిచూచాను. కాని అతన్ని ఆపలేకపోయాను.

వివే:—నేనుఆపగలను — వాసంతీ! నీవు బొత్తిగా అమాయకురాలివి. మంచి, చెడ్డలు తెలియవు. నేనునీకు నేర్పిన నీతులన్నీ—

వాస:—మీరిప్పుడుమాట్లాడటం మంచిదికాదు.

వివే:—నేనుమాట్లాడటం అవసరం. వాసంతి! నిన్న యివాళ నీప్రవర్తన చూస్తే నాకు చాలకష్టంగాఉంది. అయినా నేను సహించుకోగలుగుతున్నాను. నీకు గుర్తువుంది. నేను నీకు ఇదివరకే మాటయిచ్చాను.

నీవుకూడా అవసరంవచ్చినప్పుడు నామాట కాదనని వాగ్దానంచేశావు. ఇప్పుడు ఆసమయంవచ్చింది. (బాబూరావువంక తిరిగి) నీవు బాధిస్తున్న యీపిల్ల యిదివరకే నాకు మాటయిచ్చింది.

కమః -ఏంటీ ?

రాజా:—వాసంతి !

బాబూ:—ఆమె ? నీకా—?

వనః—వట్టిది. వట్టిది. వాసంతి ?

శోభా:—అబద్ధం. సర్వాబద్ధం.

బాబూ:—వాసంతి! అతడుమాట్లాడేది నిజమేనా ?

వాసః—(కొంచెంసేపు తటపటాయించి) ఆc.

వివే:—ఇక మీవశీకరణ కళాచాతుర్యమంతా నిష్ప్రయోజనమయిందనుకుంటాను. వాసంతి క్షేమంకోసం నేను నిశ్చయించుకున్న సంగతి అవసరం వచ్చిందికనుక ఇవాళ మీకందరికీ బహిరంగంగా చెప్తున్నాను. నన్ను మీరెవరూ అపార్థం చేసుకోరనుకుంటాను. కమలాదేవిగారూ! మీరువాసంతిని లోపలికి తిసుకొనివెళ్ళండి. ఆమె బాధపడుతున్నట్లుంది. కొంత విశ్రాంతి అవసరం.

కమః—అవును. రా వాసంతి! లోపలికివెళ్ళుదాంరా, నీవుచాలా అదృష్టవంతురాలివి వాసంతి !

(వాసంతిని తీసుకొని లోపలికివెళ్ళుతుంది. వివేకానందుడుకూడా వారివెంట వెళ్ళుతాడు.)

వనః బాబూరావుగారూ! వస్తాను. నమస్కారం. (బయటికివెళ్తుంది.)

జగః—వుష్! నేను ఒకవిషయం—

శోభా:—వుష్! (బాబురావుతో) బాబూ! విచారపడనక్కరలేదు. అసన్యాసి ఏం చేస్తున్నాడో చూచివస్తాను. (ప్రక్కగదిలోగుండా వెళ్ళుతుంది.)

రాజా:—బాబూరావ్! 'ఇండియన్ గరల్'లో వెళ్ళవా?

బాబూ:—వెళ్ళుతున్నాను.

రాజా:—బహుశ తిరిగి రావనుకుంటాను.

బాబూ:—తిరిగివస్తాను.

రాజా:—ఇంతజరిగిన తరువాతగూడానా? వచ్చి ఏంచేస్తావు ?

బాబూ:—ప్రతీకారం, మిమ్మల్ని ఎంతమందిని నాశనంచేయటానికి వీలుందో అంతమందిని—

(ప్రక్కగా వెళ్ళిపోతాడు. లోపలనుంచి గుణచంద్, నటేశం వస్తారు)

గుణ:—లెక్కలన్నీ తేల్చాము. రాజారామ్‌గారూ !

రాజా:—మంచిది.

నటే:—(మెల్లగా) 'ఇండియన్ గరల్' రేపు ప్రయాణమవుతుందా ?

రాజా:—ఆఁ,

(లోపలికివెళ్ళుతాడు. గుణచంద్, నటేశం ప్రక్కగా వెళ్ళిపోతారు. జగదీశ్ కూడా వాళ్ళవెంట బయలుదేరుతాడు. రాంబాబు మెల్లగా లోపలనుంచివస్తాడు)

రాం:— మామయ్యా !

జగ:—వుష్ ! నీవటరా.

రాం: —ఏంటికబుర్లు మామయ్యా .

జగ:— నీవు బాగా తన్నులుతిన్నావని విన్నా. అదేకబురు.

రాం:—అదిసరేలే. చినమామయ్య అమెరికా వెళ్ళుతున్నాడా ?

జగ:—నీకెందుకు ?

రాం:—నేనుకూడా వెళ్లుతున్నా. అక్కడ అడవిగేవెల్ని వేటాడుతా.

జగ:—ఏడ్చావులే లోపలికిపద.

(జగదీశ్ బయటికివెళ్ళుతాడు. రాంబాబు లోపలికి వెళ్ళిపోతాడు. నటేశం తిరిగివచ్చి రాజారామ్‌గది వాకిలి తట్టుతూ)

నటే:—క్షమించండి, తుఫానువచ్చే సూచనలగపడుతున్నవి. (సమాధానంకోసం ఆగుతాడు, సమాధానంరాదు.) అయినా 'ఇండియన్ గరల్' ప్రయాణం కావలసిందే నంటారా ?

(కొంచం సేపున్నతరువాత)

రాజా:—(లోపలనుంచి) ఆఁ. అయినా 'ఇండియన్‌గరల్' ప్రయాణం కావలసిందే.

(నటేశం కొంచెంసేపునిలబడి వచ్చినత్రోవనే వెళ్ళిపోతాడు.)

# నాలుగో అంకం

(ఆదేగది ప్రొద్దు కుంకుతుంది. గాలిసుమారం వీస్తూవుంటుంది. తుఫాను వచ్చే సూచనలు కనబడతై. పనిమనిషి గదిలో దీపాలు వెలిగిస్తూవుంటాడు. ఇద్దరు పనికత్తెలు పూలు వగైరాలతో గదిని అలంకరిస్తూవుంటారు. విశ్వేశ్వరరావు వారికి ఏవిధంగా అలంకరించాలో చూపుతూ వుంటాడు.)

విశ్వే:—రాముడూ ! మనం ప్రత్యేకంగా ఇందుకోసం అలంకరించినట్లు కనబడకూడదు. నిత్యం యీ పూలు, ఇవీ, మామూలుగా వున్నట్లే కనబడాలి.

(రాజారామ్ తనగదిలోనుంచి వస్తాడు)

రాజా:—(వాకిలిదగ్గర ఆగుతూ) ఇదంతా ఏంటి ?

విశ్వే:—ఓహ్ ! మీరా ! (పనిమనుష్యులతో) మీరు వెళ్లండి.

(వారు బయటికి వెళ్ళిపోతారు.)

రాజా:—విశ్వేశ్వరరావూ ! ఈ అలంకారమంతా దేనికి ?

విశ్వే:—ప్రథమపౌరులైన మిమ్మల్ని సత్కరించటానికి టవునంతా వూరేగింపుతో కదలివస్తూంది.

రాజా:—ఏంటీ ?

విశ్వే:—వూరేగింపుతో వస్తున్నారు. సన్నాయి, బ్యాండు వాయిద్యాలతో—లైట్లు కూడా ఏర్పాటు చేసాము. కాని గాలి ఎక్కువగా వుండటంచేత అవి మానుకోవలసి వచ్చింది.

రాజా:—విశ్వేశ్వరరావూ ! నాకిలాంటివి పనికిరావు.

విశ్వే:—ఒక అరగంటలో వూరేగింపు వస్తూంది.

రాజా:—నాకు ముందుగా ఎందుకు చెప్పలేదు ?

విశ్వే:—మీరు ఒప్పుకోరనే ముందుగా చెప్పలేదు. కమలాదేవిగారితో చెప్పాను. వారు అంగీకరించారు. నన్నీయేర్పాట్లు చేయమని, వింద యేర్పాట్లు వారు చూస్తామని చెప్పారు.

రాజా:—(దూరంగావింటూ) ఆధ్వనియేంటి ? పాటలు వినబడుతున్నవి. అప్పుడే వస్తున్నట్లుంది ?

విశ్వే:—మీరు ఇవాళ ఎందుకో అదోకతరహాగా కనబడుతున్నారు. కాని మీరు మనస్సు స్థిమితపరచుకొని మా కార్యక్రమం జయప్రదం అయ్యేటట్లుచూడాలి. మేము తక్కినవిషయాలలో జాగ్రతవహిస్తాము. టవున్‌లో అక్కడక్కడా అనుకుంటున్నారు. భూములు కొనటంలో మనంఇక రహస్యంగా వ్యవహరించలేము. ఈ వుత్సవసమయంలో— ప్రార్థనలు, ఉపన్యాసాలు అయిపోయిన తరువాత సభికులు ఆవేశం, అనందలో వున్నసమయంచూచి, లేకపోతే కల్పించి, మీరు; మనం భూములుకొనే విషయంలో ఎలాంటి రిస్కు తీసుకుంటున్నామో వారికి నచ్చచెప్పాలి.—ప్రజల్లో ముందుగా అలాంటి వాతావరణం కల్పించటం అవసరం.

రాజా:—అవును. అవును—

విశ్వే:—ఇలాంటి విషయాల్లో మనం చాలా జాగ్రత్తగావుండటం అవసరం లేకపోతే మనంఅంటే గిట్టనివాళ్ళు దీన్నిఅవకాశంగా తీసుకొని మనల్ని మరీ దుమ్మెత్తిపోస్తారు. ఈదెబ్బతో మనం శత్రుశేషంలేకుండాప్రజల్లో యదార్థంగా సంఘనాయకులమని రుజువుచేసుకోవాలి —రాజారావు గారూ! మీపేరుప్రతిష్టలే మీకు కావలసినంతబలాన్ని చేకూర్చగలవు. మీమాటకు ఎదురుండదు. కాని మనం వీలున్నంతవరకు జాగ్రత్తపడటం అవసరం—జగదీశ్‌గారు మిమ్మల్నిగురించి ఒకచక్కనిపాట తయారుచేశాడు. 'మీనోటిమాటలు ముత్యాలమూటలు' అనేపదంతో ప్రారంభం అవుతుంది. వివేకానందంగారు ఒకపెద్ద వుపన్యాసం తయారుచేస్తున్నారు. మీరు వాటికితగిన సమాధానం చెప్పవలసి వుంటుంది.

రాజా:—ఇవాళ నేనేదీచేయలేను. విశ్వేశ్వరరావూ! నీవేఆబాధ్యత—

విశ్వే:—అవికేవలం మీకుసంబంధించినవేకనుక మీరేవాటికి సమాధానం చెప్పటం అవసరం. మేముకూడా మాకుతోచినవిషయాలు — సంఘములో ఒండొరుల సహకారం, సహనం, ప్రేమ, బాధ్యతలనుగురించి ముచ్చటిస్తాము. కాని ప్రజాదృష్టిలో మీరుపొందిన గౌరవాన్నిబట్టి

మీమాటలలోనే హెచ్చువిలువ వుంటుంది. — మీరు పరధ్యానంలో వున్నట్లుంది.

రాజా:—అవును.—విశ్వేశ్వర్రావూ! సముద్రంలో తుఫానువచ్చే సూచనలు కనబడుతున్నవా ?

విశ్వే:—'పామ్ట్రీ'ని గురించి మీరు ఆలోచిస్తున్నారా? అది ఇన్సూరెన్సు చేయబడింది.

రాజా:—కావచ్చు. కాని —

విశ్వే:—రిపైర్సుకూడా చక్కగానే జరిగినై.

రాజా:—కావచ్చు, కాని ఒకవేళ ఓడమునిగిపోతే మానవజీవితాలకు హానిజరగదూ? ఓడతోబాటు ఓడలోవున్నవాళ్ళు—వాళ్ళపెట్టెలు కాగితాలు —

విశ్వే:—మీరు భలేవారే! పెట్టెలు, కాగితాలు, అంతముఖ్యంకాదు,

రాజా:—అవును. అవును. ముఖ్యంకాదు. — అదిగో ఏదోధ్వని వినబడుతుంది.

విశ్వే:—'పామ్ట్రీ' బయలుదేరుతుంది.

(గుణచంద్, కృష్ణపిళ్ళె, నటేశం వస్తారు.)

రాజా:—ఏంటి కబుర్లు ?

నటే:—ఎమీలేవండీ!

కృష్ణ:—'ఇండియన్‌గరల్'లో కెప్టెన్‌లందరూ తప్పత్రాగారు. అది సురక్షితంగా వెళ్ళుతుందనే నమ్మకం నాకులేదు. చీకటి పడుతూవుంది.

(శోభాదేవి వస్తుంది.)

శోభా:—బాబు నీకు వెళ్ళుతున్నానని చెప్పమన్నాడు.

రాజా:—ఓడ ఎక్కాడా ?

శోభా:—ఇప్పటికి ఓడచేరుకునే ఉంటాడు.

రాజా:—అతని అభిప్రాయం మార్చుకోలేదూ ?

శోభా:—లేదు. ముమ్మాటికీ మార్చుకోనన్నాడు.

(రాజారావు ఏదోమాట్లాడాలని నోరుతెరుస్తాడు. కాని వెంటనే వెనక్కు తిరిగి తనప్రైవేటుగదిలోనికి వెళ్ళుతాడు.)

విశ్వే:—రండి. మనంకూడావెళ్ళి కార్యక్రమాన్ని నిశ్చయించుకుందాము

(అందరూ రాజరావుగదిలోనికి వెళ్ళుతారు. శోభాదేవిచూస్తూ నిలబడుతుంది. ప్రక్కగదిలోనించి రాంబాబు నెమ్మదిగా తలుపుతెరచుకొనివస్తాడు. చేతిలో చిన్న మూటవుంటుంది.)

శోభా:—అరె నీవా! భయంవేసిందే!

రాం:—హుష్! మెల్లిగా.

శోభా:—ఆ మూటేంటి? ఎక్కడకు?

రాం:—(నెమ్మదిగా) నేను మామయ్యతో అమెరికావెళ్ళుతున్నా. — వెళ్ళివస్తా. (తోటలోగుండా బయటికి వెళ్ళిపోతాడు.)

శోభా:—(బయటికివెళ్ళి) అరె! ఆగు. రాంబాబూ! మూట.

(బాబూరావు ప్రయాణవేషంతో, చేతిలో సంచిపట్టుకుని ప్రక్కగావస్తాడు)

బాబూ:—శోభా !

శోభా:—(వెనక్కుతిరిగి) అరె నీవా! మళ్ళీవచ్చావేం ?

బాబూ:—ఇంకా టైమువుంది. వెళ్ళేముందు ఒకసారి వాసంతినిచూచి వెళ్ళుదామను కొంటున్నాను.

(దూరంనుంచి వనజమ్మారి, వాసంతి రావటం కనబడుతుంది. వాసంతిచేతిలో ప్రయాణపుసంచి వుంటుంది.)

వాసం:—నేను ఆయనతో వెళ్ళిపోతాను.

వన:—వెళ్ళమ్మా. వాసంతి! నీవు సుఖంగా జీవించు.

వాసం:—ఇదుగో! ఇక్కడేవున్నాడు.

బాబూ:—వాసంతీ !

వాసం:—నన్ను మీతో తీసుకొనివెళ్ళండి.

బాబూ:—ఆఁ.

శోభా:—నిజంగా ?

వాసం:—అవును! మీతోవస్తాను. అతను ఇవాళరాత్రి అందరిముందునన్ను స్వీకరిస్తానని అంటున్నాడు.

బాబూ:—అయితే—

వాసం:—అతనంటే నాకుయిష్టంలేదు. అతన్ని చేసుకోవటంకంటె నాకు చావుయిష్టంగావున్నది. నిన్న అతనిప్రవర్తన నాకు చాలాకష్టంవేసింది. ఒక అనాధను పైకిలేవనెత్తటం అతని ఆదర్శమట. నేను అనాధననీ, అందుకే నన్ను పెండ్లిచేసుకుంటున్నాననీ, అతని మాటలవల్లస్పష్టంగా తేలిపోయింది. అలాంటినీచానికి నేనుపాల్పడను. నేనుదూరంగా వెళ్ళి పోవాలనుకుంటున్నాను. మీతోనేను రావచ్చునా ?

బాబూ:—అఁ. అఁ. ముమ్మాటికీ.

వాసం:—నాకోసం మీరు బాధపడనక్కర్లేదు. నన్ను అమెరికా తీసుకొని వెళ్ళే సహాయం చేయండి. తరువాత. నాజీవితభారాన్ని నేనే—

శోభా:—(రాజారావుగది చూపుతూ) హుష్. నెమ్మదిగా.

బాబూ:—వాసంతి ! నీకష్ట సుఖాలకు నేనే బాధ్యత వహిస్తాను.

వాసం:—నా జీవితబాధ్యత మీరు వహించనక్కర్లేదు. నామీదనాకు నమ్మకంవున్నది. నన్ను అమెరికాచేరిస్తేచాలు.—ఓహ్! ఈ ఆడవాళ్ళు, ఈ సంఘం, ఈ జీవితం నాకు దుర్భరంగావున్నది. ఇక్కడనుంచి దూరంగా వెళ్ళితే చాలు.

బాబూ:—వాసంతి! నీవుకేవలం అందుకే వస్తున్నావా? నామీద నీకువేరే అభిప్రాయం—

వాసం:—లేదు. ముమ్మాటికీలేదు. మీమీదనాకు గౌరవం, ప్రేమవున్నవి. ఇక్కడప్రతివ్యక్తి మిమ్మల్ని ద్వేషించమని, మీతో మాట్లాడవద్దని నాచెవులో నూరిపోస్తున్నారు. కాని అది నావల్లకానిపని.

శోభా:—నిజంగానా ?

వన:—శోభా! వాసంతి తనహృదయాన్ని విప్పిచెపుతుంది. బాబూ! నీవు వాసంతిని అర్ధాంగిగా స్వీకరించు.

బాబూ:—సంతోషంగా.

శోభా:—వనకుమారీ! నీమాటలునాకు వింతగా కనబడుతున్నవి.

వన:—అవును. నాకుకూడా వింతగానే ఉన్నది. మొదట నేనేదీనికి వ్యతిరేకం—అబ్బా! యీపాడుసంఘం కట్టుబాట్లకు నాలాగా ఎంతమంది ఆహుతి కావలసివస్తుంది! వాసంతి! నీవు యీకట్టుబాట్లను త్రెంచు

కొని బయటపడు. నేనీమాటలు మనస్ఫూర్తిగా చెప్పతున్నాను.
వాసంతీ! నీవు బాబూరావుని పెండ్లిచేసుకొని సుఖంగాజీవించు.

బాబూ:—వాసంతి! నీఅభిప్రాయం ?

వాసం:—నేను మిమ్మల్ని పెండ్లిచేసుకుంటాను. కాని కష్టపడి పనిచేసి స్వతంత్రజీవితం గడపటం నాఅభిమతం ఆటబొమ్మ కావటం నాకు యిష్టంలేదు.

శోభా:—అవేసరియైనబాట.

బాబూ:—మంచిది. నీస్వతంత్రజీవితానికి నేనుఅడ్డంరాను.

శోభా:—బాబూ! నీకు కోటిదీవెనలు. టైము అవుతుంది. మీరు బయలు దేరాలి.

బాబూ:—అవును. శోభా! ఒకమాట! అదిగో—(చాటుకు తీసుకొనివెళ్ళి మెల్లిగా మాట్లాడుతూవుంటాడు.)

వన:—వాసంతీ! నీవు అదృష్టవంతురాలివి. సుఖంగా జీవించు—చివరి సారి నన్ను ముద్దుపెట్టుకోనివ్వు.

వాసం:—పిన్నీ! చివరిసారి కాదు. మళ్ళీమనం కలుసుకుంటాము.

వన:—వాసంతీ! నీవు మళ్ళీ తిరిగిరావద్దు. రానని నాముందు శపథం తీసుకో. (దూరంగా ఆకాశంలోనికిచూస్తూ) నీవు సముద్రం దాటివెళ్ళి అక్కడేవుండి సుఖంగాజీవించు. నాకు అదే పరమ సంతోషం—అక్కడ స్వతంత్రజీవితం గడపవచ్చు. గదిలో ఏకాంతంగాకూర్చొని ఆలోచిస్తుంటే ఆసంఘం, ఆజాతి, స్వేచ్ఛావాయువులమధ్య హాయిగా జీవిస్తూవున్నట్లు నాకు కనబడుతూవుంటుంది—వాసంతీ! నీవు తిరిగి యీ నరకకూపంలో పడవద్దు. అక్కడేవుండిపో.

వాసం:—ఓహో! పిన్నీ! ఎప్పటికైనా నీవుమమ్మల్ని అనుసరించవలసి వుంటుంది.

వన:—నేనా? (వాసంతిని ముద్దుపెట్టుకొంటుంది.) వాసంతీ! నాజీవితం పూర్తికావచ్చింది. బ్రతికినంతకాలం ఇక్కడే సుఖంగా వుండటానికి ప్రయత్నిస్తాను.—నీభర్తను సుఖపెట్టాలి, అలాచేస్తానని నాకువాగ్దానం ఇవ్వు.

వాసం:—వాగ్దానాలంటే నాకు సుతరామూ ఇష్టంలేదు. పరిస్థితులు వాటం తటవే జరిగిపోనివ్వటం నా అభిమతం.

వన:—అవును. అవును. నీ ఆత్మవిశ్వాసాన్ని. వ్యక్తిత్వాన్ని భద్రపర్చుకో.

వాసం:—తప్పకుండా వినీ.

శోభా:—(బాబురావుయిచ్చిన కొన్ని కాగితాలు తనసంచిలో పెట్టుకుంటూ) తప్పకుండా. తప్పకుండా—బాబూ! నీకు టైముదాటుతుంది. వెంటనే బయలుదేరాలి

బాబూ:—ఇక ఆలస్యంలేదు శోభా! నీవుచూపిన అనురాగానికి ధన్య వాదాలు. వనకుమారీ! నీస్నేహంమరచిపోలేను మీకునమస్కారాలు వెళ్ళొస్తాము.

వన:—నమస్కారంబాబూ! సుఖంగావెళ్ళండి. వాసంతి! జాగ్రత్త. మీరు యిద్దరూ సుఖంగా జీవించండి. అదే నాఅంతిమ ఆదర్శం.

(బాబూరావు, వాసంతీ త్వరత్వరగా తోటలోనుంచి వెళ్ళిపోతారు.)

శోభా:—వనకుమారీ! మనమిద్దరము ఒంటరిగా మిగిలిపోయాము. నీవు వాసంతిని, నేను—బాబును దూరం చేసుకున్నాము.

వన:—నీవు—బాబును—?

శోభా:— ఆఁ. అక్కడున్నప్పుడే అతడు చాలావరకు నాచేతులనుంచి దాటిపోయాడు. తనకాళ్ళమీద తానేనిలబడాలని అతనిపట్టువల. అందుకనే నేను ఇంటిమీద గాలిమళ్ళిందని అబద్ధంచెప్పి ఇక్కడకు రావటం జరిగింది.

వన:—అదా! సరే. అయితే నిన్ను మళ్ళీ రమ్మనలా ?

శోభా:—మారుఅక్క పెద్దదయిపోయింది. ఇక ఆమెతో అతనికి అవసర మేముంది ?—పురుషులు తమ సుఖంకోసం తక్కిన ఎలాంటిగట్టి సం బంధాన్నైనా త్రెంచుకోగలరు.

వన:—కొన్నివిషయాల్లో కావచ్చు.

శోభా:—గతించిన దానికి చింతించిన ప్రయోజనంలేదు—వనకుమారీ ! ఇక మనమిద్దరమే మిగిలాము —మనంకలిసి ఒకటిగా ఉండకూడదూ?

వన:—నేనూ వొంటరిదాన్నయిపోయాను.—శోభా! ఇక దాచలేను. నేను అతన్ని మనసారా ప్రేమించాను. (కళ్ళుతుడుచుకుంటూ) కానినిర్భాగ్యురాలిని.

శోభా:—నీవా? (తనచేతులతో వనకుమారిచేతులు పట్టుకుని) నిజమా?

వన:—నాబ్రతుకంతా యీ రెండుమాటలలోనేవున్నది. నేను అతన్ని ప్రేమించాను, అతనికోసం ఎదురుచూస్తూవచ్చాను. ప్రతిసంవత్సరం అతడు వేసవికాలంలో వస్తాడేమోనని ఆశ, నిరాశతోజీవితంగడుపుతూ వచ్చాను చివరకు అతడువచ్చాడు. కాని నామీదఅతనిదృష్టిపడలేదు.

శోభా;—నీవు అతన్నిప్రేమించావు,—చివరకు నీచేతులతోనే అతడుకోరిన సుఖాన్ని అతనిచేతులకు అందచేశావు—

వన:—అవును. నేను అతన్నిప్రేమించాను కనుక, నాచేతులతోనే అతనికి కావలసిన సుఖాన్ని అందజేశాను - శోభా! ఇంతవరకు ఎన్నోకలలు గంటూ, జీవితంలోఎన్నోఆశలు కల్పించుకుంటూ బ్రతుకుతూ వచ్చాను. అతడు తిరిగివచ్చాడు. కాని అతనిమనస్సులో నేనున్నట్లు లేదు. నామీదబాబుకు యిష్టంవున్నట్లే కనబడలేదు.

శోభా:—వాసంతి నిన్ను మ్రింగివేసింది.

వన:—వాసంతి మంచిపనేచేసింది.—అతడు మొదట్లో ఇక్కడనుంచి వెళ్ళిపోయేటప్పుడు, మేమిద్దరం సమానవయస్కులం.—కాని తిరిగి అతన్ని చూచినతరువాత—నాకే తలవంపులయింది. నేను అతనికంటె పది సంవత్సరాలు పెద్దదాన్నిగా కనపడ్డాను.—అతడు స్వేచ్ఛావాయువులు పీల్చుకుంటూ యౌవనాన్ని, ఆరోగ్యాన్ని పెంచుకోగలిగాడు. నేను—ఇక్కడ, యీపాడుసంఘంలో కుమిలి, కుమిలి, అతనినామ పఠనంచేస్తూ—

శోభా:—అతనిసుఖంకోసం అతని నామపఠనంచేస్తూవచ్చావు.

వన:—అవును. ఆపఠనంలో దేవతావిగ్రహాన్ని సృష్టించగలిగాను.—శోభా! నాకు ద్వేషంలేదు. మనమిద్దరం అతనికి అక్కలమే! అవునా?

శోభా:—(వనకుమారిని కౌగలించుకుంటూ) అవును. అవును.

(రాజారామ్ తనగదిలోనుంచి ముందుగా బయటికివస్తూ వెనుకవున్నవారితో)

రాజా:—సరే మీయిష్టంవచ్చినట్లు ఏర్పాట్లుచేయండి. (తలుపువేస్తాడు) ఓహో! మీరిక్కడేవున్నారా? వనకుమారీ! అదేమిటలావున్నావు? నీ దుస్తులుబాగాలేవు. వెళ్ళి త్వరగామార్చుకో.

(వనకుమారి లోపలికి వెళ్ళుతుంది.)

శోభా:—మీజీవితంలో వూహించరాని శుభసమయం ఆసన్నమౌతుంది.

రాజా:—(చీకాకుగా అటు, ఇటు తిరుగుతూ) అవును.

శోభా:—ఇలాంటిసమయంలో మీరు గర్వంగా, సంతోషంగా వుండాలి.

రాజా:—(ఆమెను తీక్షణంగాచూస్తూ) ఆఁ,

శోభా:—మొత్తంటవునంతా అలంకరించబడుతుందని విన్నాను.

రాజా:—అవును. అలాంటిఏర్పాట్లు చేయాలని వారిఅభిప్రాయం.

శోభా:—అన్నిక్లబ్బులవారు వారి వారి ప్రత్యేకచిహ్నాలతో సమావేశమయి, మిమ్మల్ని సత్కరించబోతున్నారు. అన్నిపత్రికలకుయీరాత్రే 'సంఘోద్ధారక—సంఘనాయక శిరోమణి శ్రీ. శ్రీ. రాజారామ్‌గారు ప్రశాంతమైన తనగృహంలో, టవునులోవున్న యావన్మంది ప్రజానీకంచేత సన్మానించబడ్డారు.' అని తంతిద్వారా వార్తలు అందజేయబడతై.

రాజా:—ఊరేగింపుతో ప్రజానీకం మాయింటిముందుకు వచ్చినతరువాత, నేను లోపలనుంచి బయటికివచ్చి వారికి కృతజ్ఞతాభివందనములు తెలియచేయవలసి వుంటుంది.

శోభా: చేయవలసివుంటుంది.

రాజా:—ఆసమయం నాకు సంతోషదాయకం అనుకుంటున్నావా?

శోభా:—లేదు. నీకు అంతసంతోషంగావుండదు.

రాజా:—శోభా! ఎగతాళిచేస్తున్నావా?—శోభా! ఈసంఘంలోనేను ఒంటరిగా ఎలాంటిబాధలు అనుభవించుతున్నానో, నాజీవితం ఫలవంతం చేసుకోటానికి ఎన్నికష్టాలు ఎదుర్కొంటున్నానో నీకుతెలియదు. నా ప్రయత్నాలన్నీ వృథా అయిపోతున్నవి—జనంలో నామీదవున్న అభిప్రాయం, గౌరవం మార్చుకొని వాడుకొంచెం ముందుకు చూడగలిగితే, నాలో ప్రత్యేకత ఏమీలేదని గ్రహించగలుగుతారు. మేము సంఘంలో

నాయకులుగా చలామణి అవుతున్నాము. కాని యదార్థంగా మేము సంఘదాసులము.

శోభా:—అదిగుర్తించటం ఇంతకాలం పట్టింది ?

రాజా:—చాలాకాలంనుంచీ ఆలోచిస్తూనేవున్నాను. కాని ఇప్పుడే, నీవు వచ్చినతరువాత గానీ నాపొరపాటు గ్రహించలేకపోయాను.—శోభా ! నిజంగా నిన్ను త్యజించటంలో నేను చాలాపొరపాటు చేశాను.

శోభా:—కావచ్చు. కాని నీవు మరొకస్త్రీని చేపట్టిచేసిన ఘనకార్యంఏంటి ? కేవలం బానిసగా, కీలుబొమ్మగా తయారుచేసి నీయిష్టంవచ్చినట్లు ఆడించావు. ఆమెతమ్ముని అప్రతిష్టపాలుచేసి ఆమెను తలెత్తుకోనివ్వకుండా చేశావు.

రాజా:—అవును—నేను మోసంచేశాను, అబద్ధం —

శోభా:—అయితే దాన్నిఎందుకు సర్దుకోవు ?

రాజా:—శోభా! అది నావల్లకానిపని.

శోభా:—మోసంవల్ల మీరుపైకిరావాలని కోరుకుంటున్నారా ?

రాజా:—లేదు. శోభా! జీవితం శాశ్వతంకాదని నాకుతెలుసు. నేను, నాతోపాటున్న యీసంఘం కొద్దికాలంలోనే నాశనంకాకతప్పదు. కాని— కాని, నాపుత్రునికోసం, అతని భావిజీవితంకోసం నేను సంఘంలో గౌరవస్థానాన్ని సృష్టించుకోవలసి వచ్చింది. ఎప్పుడోఒకప్పుడు సంఘములో సత్యంప్రకాశించక మానదు. దాన్ని ఆధారంచేసుకొని అతడు తన తండ్రికంటె ఎక్కువ ఆదర్శవంతమైన సుఖజీవితాన్ని గడపగలడు.

శోభా:—కేవలం మోసం పునాదిఅయినప్పుడు సత్యంప్రకాశించజాలదు. రాజారామ్! బాగా ఆలోచించుకో, నీవు నీకుమారునికి ఎలాంటిసంస్కారం కలిగించు చున్నావో ?

రాజా:—(విచారంగా) తెలుసు. శోభా! నాకుతెలుసు—(గట్టిగాఆలోచిస్తూ) శోభా! ఇక మాట్లాడటం అనవసరం. నీవు నన్ను అబుచలేవు.

(జగదీశ్ చేతిలో ఒకఉత్తరంపట్టుకొని హడావిడిగా వస్తాడు.)

జగ:—ఇదిగో... కమలా! కమలా !

రాజా:—ఏంటి హడావిడి ?
జగ:—ఆc. ఆc. వస్తా. ఇప్పుడేవస్తాను.
(ప్రక్కగదిలోనుంచా లోపలికి వెళ్ళిపోతాడు.)
శోభా:—రాజారామ్‌గారూ! మిమ్మల్ని నాశనంచెయ్యటానికి మేమిక్కడకు వచ్చినట్లు మీరు అభిప్రాయపడుతున్నారు—మీకుభయంలేదు. మీ యీ సంఘంలో చీడపురుగుగాభావిస్తున్న అతడు వెళ్ళిపోయాడు.
రాజా:—తిరిగివస్తానని చెప్పాడు.
శోభా:—అతడు తిరిగిరాడు, వాసంతి అతనివెంట వెళ్ళింది.
రాజా:—తిరిగిరాడూ! అతనివెంట వాసంతి—?
శోభా:—అవును అతని భార్యగా...
రాజా:—వాసంతికూడావెళ్ళిందా? 'ఇండియన్‌గరల్'లో?
శోభా:—అతుక్కు వోడలో వెళ్ళలేదు. వారిద్దరూ 'పామ్‌ట్రీ'లో బయలుదేరారు.
రాజా:—సరే!—(గబగబా తనగది దగ్గరకువెళ్ళి తలుపుతట్టి పిలుస్తూ) నటేశం! 'ఇండియన్‌గరల్' బయలుదేరటానికివీల్లేదు. వెంటనేఆపించు
నటే:—(లోపలనుంచి) 'ఇండియన్‌గరల్' చాలాసేపటిక్రిందటే బయలుదేరింది సార్ !
రాజా:—(తడబడిన మాటలతో) అనవసరం—వృథాప్రయాస.
శోభా:—ఏంటి మాట్లాడుతున్నారు ?
రాజా:—ఏమీలేదు. ఏమీలేదు.
శోభా:—రాజారామ్! ఇప్పటికైనా పొరబాటు తెలుసుకోటం మంచిది. నాదగ్గర నీవువ్రాసిన రెండుఉత్తరాలూ వున్నవి.
రాజా:—అవి నీదగ్గరేవున్నవా? నీవు యీవూరేగింపు అయినతరువాత, జనమంతా ఇక్కడికివచ్చినతరువాత—
శోభా:—నిన్ను నాశనంచేయటానికి నేనిక్కడకురాలేదు. నీచే ఆత్మపరిశోధనచేయించి నీబుద్ధిని సక్రమమార్గంలో పెట్టటానికే నేనిక్కడకు వచ్చాను. అందులో నేను కృతార్థురాలను కాలేకపోవటమంటే నీవు నీజీవితాన్ని ఇంకా అసత్యం, మోసంతోనేగడప సంకల్పించుకున్నట్లు

తెలుతుంది. జయమో: అపజయమో తేల్చుకోవలసినబాధ్యత నీదికాని నాదికాదు.—ఇదిగో ఈరెండువుత్తరాలు చించివేస్తున్నాను. (సంచిలో వున్నవుత్తరాలుతీసి చించివేస్తుంది.) ఇక వ్యతిరేకంగా నీకు ఎలాంటి సాక్ష్యంలేదు, నీవుండదలిస్తే సుఖంగా వుండవచ్చు.

రాజా:—(విచారంగా) శోభా! ఇకనేను బ్రతకటం అనవసరం—కేవలం నా పుత్రునికోసం బ్రతకవలసి వస్తుంది.

(జగదీశ్ హడావుడిగా వస్తాడు.)

జగ:—ఎవరూలేరు. కమల కనబడలేదు.

రాజా:—ఏంటా హడావుడి ?

జగ:—(విచారంతో) రాంబాబు 'ఇండియన్‌గరల్'లో వెళ్ళిపోయాడు.

శోభా:—అవును. అతడు ఇక్కడనుంచి వెళ్ళిపోవటం నేనుచూసాను.

రాజా:—(తనగది తలుపుదగ్గరకువెళ్ళి తొట్రుపాటుతో) నటేశం! 'ఇండియన్ గరల్'ను వెంటనే ఆపించు.

నటే:—వీలులేదుసార్ ! ఇదివరకే—

రాజా:—తప్పదు రాంబాబు ఆవోడలోవున్నాడు.

నటే:—ఆఁ. (లోపలనుంచి అతడు, విశ్వేశ్వర్రావు, గుణచంద్, బయటికి వస్తారు) పొరపాటు.

జగ:—ఇదిగోవుత్తరం. ఓడ సముద్రంలోపలికి వెళ్ళేటంతవరకు అతడు చెక్కలసందున దాక్కుంటానని వ్రాసాడు.

రాజా:—నేనిక వాణ్ణిచూడలేను.

విశ్వే:—అదేంటి అలాఅంటున్నారు ? — అది గట్టిఓడ. రిపైర్సు బాగా జరిగినై—పైగా మీవర్కుషాపులోనే.

రాజా:—కాదు, నేనిక వాణ్ణిచూడలేను. ముమ్మాటికి చూడలేను. శోభా (చెవినొగ్గివింటూ) ఏమిటది ?

విశ్వే:—బ్యాండుమేళాలు. ఊరేగింపు తరలివస్తుంది.

రాజా:—వద్దు. ఇందులోనేను జోక్యంకలిగించుకోను. నాకిదిఅనవసరం.

విశ్వే:—కాదు. మీరు పూనుకోవాలి.

గుణ:—మీభవిష్యత్తు దీనిమీద ఆధారపడివున్నది.

రాజా:—నాభవిష్యత్తు! ఎందుకోసం? ఎవరికోసం?
విశ్వే: —అప్రశ్నకు సమాధానం చెప్పవలసింది మేముకాదు. సంఘం.
గుణ:—అవును.

(వనకుమారి లోపలనుంచివస్తుంది. వాయిద్యాలు దూరంగా బజారులో విన బడుతుంటై.)

వన:—ఊరేగింపువస్తుంది—కాని కమల ఇంట్లోలేదు. ఎక్కడికివెళ్ళిందో?
రాజా:—కమల ఇంట్లోలేదా?—శోభా! చూచావుకదూ? నాకిప్పుడు కష్ట సుఖాలు పంచుకోటానికి తోడుగా ఎవరూలేరు.

(రాజారామ్ఇంటి గేటుదగ్గరకు ఊరేగింపువస్తుంది, రకరకాల దీపాలు వెలుగుతూవుంటవి, 'సంఘనాయకుడు రాజారామ్ వర్ధిల్లుగాక' అని పెద్దగా నినాదాలు వినబడుతూ వుంటవి.)

రాజా:—(నీరసంగా) విశ్వేశ్వరావూ! నేను సహించలేను. ఆఉత్సవం మాన్పించి ఎవరియిళ్ళకువారిని పంపించు.
విశ్వే:—ఆఁ. మీకు వొంట్లోబాగాలేదా?
వన:—శోభా! ఏమిటిది? అలాఅంటున్నాడు?
శోభా:—హుష్! (అమెచెవులో మెల్లగాచెపుతుంది.)
రాజా.—ఆమాటలు నేనువినలేను. నాశరీరం—
కృష్ణ:—మీ కుర్రవానికోసం అంత బాధపడనక్కర్లేదు. వాడు తిరిగిక్షేమంగానే వస్తాడు.
గుణ:—మీరు భగవంతునిమీద భారంవేయండి రాజారామ్గారూ!
విశ్వే:—ఆవోడ సాధారణంగా మునగదనే నావిశ్వాసం.
న టే:—ఆఁ.—
రాజా:—నాకు నిజంగా పిచ్చెక్కిపోతుంది.

(కమలాదేవి తోటలోనుంచి ఒకశాలువా ముసుగుపెట్టుకొని వస్తుంది.)

కమ:—(రాజారామ్తో) విన్నారా?
రాజా:—ఆఁ విన్నా. — కొడుకు పారిపోతూవుంటే తల్లివి నీవేమి చేస్తున్నావు?

కమ:—నేనా? నేను.—వాణ్ణి తీసుకొనివచ్చాను.

(అందరూ సంతోషం ప్రకటిస్తారు.)

రాజా:—నిజమా? ఏడీ? ఎక్కడున్నాడు?

కమ:—వాణ్ణి ముందు క్షమిస్తానంటేగాని చెప్పను.

రాజా:—తప్పకుండా! సరేగాని అసలువాడు వెళ్ళినట్లు ఎలా తెలుసుకో గలిగావు?

కమ:—అదేతమాషా—నిన్న వాడిమాటలుబట్టి కాస్త అనుమానం కలిగింది. ఇవాళ చూద్దునుగదా, వాడు తనగదిలో కనబడలేదు. వాడి సూట్‌కేసు, గుడ్డలు మాయం అయినవి. నేను వెంటనే మన శ్యామల రావును తీసుకొని ఓడలోకివెళ్ళాను అప్పుడే ఓడ బయలుదేరబోతూ వుంది. మనఅదృష్టం బాగుంది. బాబుదొరికాడు — నీవు వాణ్ణిఏమీ అనవద్దు.

రాజా:—ఆc.

కమ:—శ్యామలరావునుకూడా మీరేమీ అనకండి.

రాజా:—శ్యామలరావునా? అతని విషయం నీకేమితెలుసు? 'ఇండయుణ్ గరల్' బయలుదేరిందా?

కమ:—లేదు. బాబును వెదకటానికి చాలాసైపుపట్టింది చీకటిపడింది. కెప్టెను తొందరపెట్టసాగాడు. కాని శ్యామలరావు మీపేరుచెప్పి మీరు ఆపమన్నట్లుగా చెప్పటంవల్ల ఇవాళప్రయాణం ఆపివేయుటమయింది.

రాజా:—సంతోషం—పరమ సంతోషంగావుంది.

కమ:—నిజమా! ప్రయాణం ఆపినందుకు మీకు—

రాజా:—నాకేమీ కష్టంలేదు.

నటే:—(కిటికీదగ్గరకువెళ్ళి) ఊరేగింపుతో జనం తోటలోగుండా లోపలికి వస్తున్నారు.

రాజా:—వారికరావచ్చు—రమ్మను,

విశ్వే:—తోట అంతా మనుషుల మయమే—

కృష్ణ:—వెనుక బజారుకూడా నిండివున్నది.

విశ్వే:—మొత్తంటవునే యివాళ మారు మ్రోగిపోతుంది. రాజారామ్‌గారూ! నిజంగా ఇవాళ పర్వదినం..

గుణ:—అదుగో! వివేకానందంగారు కమిటీసభ్యుల్ని వెంటపెట్టుకొని వస్తున్నారు.

రాజా:—లోపలికి రమ్మను.

విశ్వే:—రాజారామ్‌గారూ! మీ మనసు కలవరంతోవున్నది. మీరు—

రాజా:—నేనా? ఏంటి?

విశ్వే:—మీరు ఇష్టపడితే మీతరఫున నేను మాట్లాడుతాను.

రాజా:—లేదు. నేనే మాట్లాడుతాను.

విశ్వే:—కాని ఏంమాట్లాడాలో మీరు—?

రాజా:—ఆఁ. ఏంమాట్లాడాలో నాకు తెలుసు.

(వాయిద్యాలు పెద్దగా వినబడుతూవుంటవి. వివేకానందం కొంతమందిసభ్యుల్ని తీసుకొని గదిలోప్రవేశిస్తాడు. వారితోపాటు మరికొంతమందిజనం ప్రవేశిస్తుంది. వెనుకవరండాలో, తోటలో, బజారులో జనం బారులుదీర్చి వుంటుంది.

వివే:—రాజారామ్‌గారూ! మేమీవిధంగావచ్చినందుకు మీకుకొంత ఆశ్చర్యం కలిగించకమానదు. మీరు ఇంతవరకు సంఘంకోసం, స్వార్థత్యాగంతో చేస్తున్నసేవను, ముఖ్యంగా యీతరుణంలో మీరుచేయబోతున్న కృషిని,యీపురవాసులెన్నటికీ మరువజాలరు మీఅపారసేవకు హృదయపూర్వక ధన్యవాదము లర్పించుకొని, ఉడుతాభక్తితో మీకు కానుకలు సమర్పించుకొనుటకు పురజనులందరు విచ్చేశారు.

(జనంలోనించి 'రాజారామ్‌గారు వర్ధిల్లాలి' అనికేకలు)

నిజంగా మీముందుమేము అత్యంత అల్పులము. మీసేవను కొనియాడదగ్గశక్తి, సామర్థ్యాలు మాదగ్గరలేవు. మీ నౌకానిర్మాణశాఖ, ఆశాఖలో పనిచేస్తున్న శ్రామికవర్గంపై మీరుచూపుతున్న అనురాగం, ప్రతిశ్రామికవేత్తకు ఆదర్శప్రాయమని చెప్పటం ఏమాత్రం అతిశయోక్తి కాజాలదు. ఇతరత్రా మీరు అనేకవిధాలయిన వ్యాపార సంస్థలు నడుపుతూ వందలకొలది కుటుంబాల జీవితానికాధారభూతు

లయినారు. ఒక్క మాటలో చెప్పాలంటే, మీరు మన యీ టవును యొక్క ప్రజానీకానికంతటికీ ప్రధానాంగమని చెప్పవచ్చు.

(జనంలోనుంచి పెద్దగా 'వినండి, వినండి' అనిచప్పట్లు)

మీరుచేస్తున్న ప్రతిపనీ కేవలం స్వార్థరహితంగా, ప్రజాక్షేమాన్ని ఆదర్శంగాపెట్టుకొని చేయటం నిర్వివాదాంశం. ప్రస్తుతంమీరు అదే దృష్టితో రైల్వేలైను ఏర్పాటుచేయటం పురవాసులలో అమితానందం కలుగజేసినది.

(జనంలోనుంచి 'అవును, అవును' అని ధ్వనులు)

కానీ మీ యీకృషిలో కొన్నిఅడ్డంకులు ఏర్పడుతున్నవని, కొంత మంది కేవలం సంకుచితదృష్టితో, స్వార్థబుద్ధితో, మీయీకృషి నాధారంగాచేసుకొని తమ స్వలాభాలకోసం యత్నించటం గర్హించవలసిన విషయం.

('వినండి, వినండి' అనికేకలు)

మీకృషిఫలితంగా రాబోవు లాభాలు మనసంఘానికి సంబంధించని ఇతరవ్యక్తులు ముందుగానే పసికట్టి అనుభవించటానికి పూనుకోవటం సహించరానిది.

('సిగ్గు, సిగ్గు' అనికేకలు)

ఆ విషయం మీరుగ్రహించియేవున్నారు. కాని అట్టివాటినికూడ మీరు లక్ష్యపెట్టక యేకలక్ష్యంతో, విశాలహృదయంతో, మొత్తం మానవ సంఘాన్నిదృష్టిలోపెట్టుకొని కృషికిపూనుకోవటం గమనిందగ్గవిషయం.

(జనంలో—'కాదు, కాదు'. 'అవును అవును' అనికేకలు)

ఈరోజున అట్టి అసమాన, అసాధారణవ్యక్తిని గౌరవిం కలిగిన అవకాశం మాకు అమితానందాన్ని కలిగించుచున్న నూతనశకారంభానికి ప్రారంభదినం. రైల్వేస్కీములో పొరు బోతున్న అప్రతిహత శక్తి, సామర్థ్యములు, ధైర్యసాహసాలు సంఘానికి పట్టుగొమ్మలై, చీడపురుగులను నాశనంచేసి సంఘాన్ని ముందుకు తీసుకొని పోగలవని మేము విశ్వసిస్తూవున్నాము. మేమువిన్న మాటలు రూఢిఅయినట్లయితే అలాంటి చీడపురుగులు కొన్నింటినుంచి, యీ

స్వాతంత్ర్యమే సంఘం వూహించిన దానికంటె ముందుగానే విముక్తి చెందింది.

(జనంలో కోలాహలం—'ఆర్డర్, ఆర్డర్' అని కేకలు)

ఇలాంటి సంఘటన మనకు నిజంగా సంతోషదాయకం, భావియత్నానికి శుభసూచకంకూడాను. నేనీవిషయం ప్రస్ఫుటంచటంలో అభిప్రాయం— రాజారామ్‌గారు నీతి, ధర్మం, న్యాయంకోసం కుటుంబ సంబంధాలుకూడా త్రెంచుకోటానికి వెనుకాడరని చూపటమే.

('అవును, అవును' కేకలు)

రాజా:—(మాటలమధ్యలో) నేను—

వివే:—క్షమించండి. ఒకటి, రెండుమాటలు చెప్పి ముగిస్తాను. ఇంతవరకు మీరుచేస్తున్న సేవ యేప్రతిఫలాన్నీ అపేక్షించకుండానే చేస్తూవున్నారు. కాని మాప్రార్థన అంగీకరించి, మీకు యిష్టంలేకపోయినా, మాతృప్తి కోసం, మేముతెచ్చినయీ కానుకలు మీరు అంగీకరించవలసివుంటుంది

('రాజారామ్ గారు వర్ధిల్లాలి' అని కేకలు)

(వివేకానందం దూరంగావున్న ఒక మనిషిని సైగచేస్తాడు. అతను ఒక పెద్ద బుట్ట ముందుకు తీసుకొనివస్తాడు. కమిటీసభ్యుల్లో ఒకాయన వివేకానందుడు చెప్పిన ప్రకారం కానుకలు అందజేస్తూ వుంటాడు.)

ఇదిగో రాజారామ్‌గారూ! మీకు మేము హృదయపూర్వకముగా యీ బంగారు కాఫీసెట్టును అర్పించుకుంటున్నాము. విశ్వేశ్వరరావుగారూ! రాజారామ్ అనుయాయుల్లో మీరు ముఖ్యులు. మీకు యీ వెండికప్పును సమర్పించుకుంటున్నాను గుణచంద్‌గారూ! మీరు రకరకాల చిత్రాలు కలిగిన యీ ఆల్బమ్ స్వీకరించగోరెదము. కృష్ణ పిళ్ళెగారూ! మీకు క్యాలికో బైండుచేసి, సువర్ణాక్షరాలతో చూడటానికి అందంగావుండి, మీరు చదువుకుంటున్నప్పుడు ఆనందాన్నిచ్చే యీ నీతిశాస్త్రాన్ని పరిగ్రహించ గోరెదము. (జనంపక్క తిరిగి) సోదరులారా! (చేయెత్తి) 'రాజారామ్‌గారు, వారి అనుయాయులువర్ధిల్లాలి.' 'సంఘనాయకులు వర్ధిల్లాలి'

(జనం పెద్దగా అవే నినాదాలు చేస్తుంది)

శోభా:—బావా! నేనుకూడా నీకు నాఅభివందనాలు తెలియచేస్తున్నాను.

(అంతా నిశ్శబ్దం)

రాజా:—(నెమ్మదిగా) మిత్రులారా! ఇంతవరకు మాట్లాడుతున్న మిత్రుడు ఈదినం నూతనశకారంభంగా సూచించటం గమనించవలసి వుంటుంది. అలాంటి నూతనశకంకోసం ఎదురుచూస్తూవున్నాను. కాని దానికి ప్రారంభోత్సవం చేసేముందు—సత్యం—దేన్నయితే యింత వరకు మనంపూర్తిగా విస్మరించామో, అట్టిసత్యాన్ని పునాదిరాయిగా స్వీకరించవలసివుంటుంది. (జనంలో వొకరిముఖం వొకరు చూస్తూవుంటారు.) కాబట్టి ఇంతవరకు ఆచారప్రకారం వివేకానందంగారు నన్నుగురించి పొగడిన పొగడ్తలకు నేను అర్హుడను కాదనియే చెప్ప వలసి వస్తుంది. కారణం? ఇంతవరకు నేనుచేసిన యేపనికూడా స్వార్థత్యాగంతో, అపేక్షారహితంగా చేయలేదు. కేవలం లాభాలకోసమే నేను కృషిచేయకపోయినా, నేనుచేస్తున్న ప్రతియత్నంలోనూ అధికార వాంఛ, పలుకుబడి, గౌరవస్థానం మిళితమైవున్నవని చెప్పటంలో సందేహంలేదు.

విశ్వే:—ఆс. తరువాత!

రాజా:—అందువలన నేను విచారపడటంలేదు. ఇప్పటి మన యీసంఘములో సామర్థ్యంకల వ్యక్తుల్లో నేనూ వొకడనని చెప్పకోటానికి నాకు సందేహంలేదు.

('అవును, అవును' అని కేకలు)

కాని అన్యాయం, మోసం ఎదుర్కొగలశక్తి నాలోలేదు. ఒకప్రముఖ వ్యక్తిచేసే ప్రతికార్యాన్ని, సందేహిస్తూ దానికి యేదోవొక విపరీతార్థం చెప్పుతూ వ్యతిరేకప్రచారంచేసే తత్వం మనసంఘంలో బాగా వ్యాప్తి చెందివున్నది. అందుకు వుదాహరణగా మీకు ఒకసంగతి బయట పెట్టుతాను.

విశ్వే:—(నిట్టూర్పు విడుస్తూ) ఆс. ఆс.

రాజా:—మనంవేయబోయే రైల్వేలైను చుట్టుప్రక్కల భూములన్నీ ఎవరో రహస్యంగా కొనివేస్తున్నారని టపుకాలో పుకారువ్యాపించింది.

వాటిని కొనివేస్తున్నదినేనే. మరెవ్వరూ కాదు. (జనంలో గుసగుసలు) ప్రస్తుతం వాటిమీదనాకు సంపూర్ణమైనహక్కు యేర్పడివున్నది.—ఈ రహస్యం నామిత్రులు—విశ్వేశ్వర్రావు, గుణచంద్, కృష్ణపిళ్ళె గార్లకు తప్ప నేనెవ్వరికీ బయటపెట్టలేదు.

విశ్వే:—అంతాఅబద్ధం—సర్వాబద్ధం.

గుణ:—అసలు విషయం—

కృష్ణ:—ఇంతవరకు దీన్నిగురించి మేము ఏనిర్ణయానికి రాలేదు.

రాజా:—అవును. ఇంతవరకు ఏనిర్ణయం జరగనిమాట వాస్తవమే. కాని నేను చెప్పబోయేది ఈముగ్గురూ అంగీకరిస్తారనుకుంటాను. ఈభూము లన్నీ పబ్లిక్ షేర్సుగామార్చి వచ్చేలాభాలన్నీ సభ్యులందరూ అనుభ వించేయేర్పాటు చేయాలని నాతలంపు. ఇష్టంవచ్చిన వారందరూ షేర్లువేసి సభ్యులు కావచ్చు.

('రాజారామ్ గారికీ జై' అని కేకలు. విశ్వేశ్వర్రావు, గుణచంద్, కృష్ణపిళ్ళె ఒకవిముఖాలుఒకరు చూచుకుంటారు.)

రాజా:—సోదరులారా! ఆగండి. మీయీ జయధ్వానులకు నేను అర్హుడను గాను. మొదట నాకీఅభిప్రాయంలేదు. మొత్తం యీభూములన్నీ నా క్రిందనే అట్టిపెట్టుకోవాలనుకున్నాను. కాని యిప్పుడా అభిప్రాయం మార్చుకుంటున్నాను.—ఎలాగైనా లాభాలురావాలంటే యీవ్యాపారం ఒకవ్యక్తిపరంగా జరగటం మంచిది. మీరుఅంగీకరిస్తే మీతరఫున నేను నాశక్తికొలది పనిచేయుటానికి సంసిద్ధంగావున్నాను.

(జనంలోనుంచి 'ఇష్టపడుతున్నాం' అని కేకలు)

కాని ముందుమీరందరూ నేనెట్టివాడనో తెలుసుకోడం అవసరం. ఎవరికివారు ఆత్మపరీక్షకు పూనుకోవాలి. ఇప్పుడు మనం నూతన శకా రంభోత్సవం చేయబోతున్నాము. కనుక ఇంతవరకు సంఘంలోవున్న కుళ్ళు, మోసం, అన్యాయం, అధికారవాంఛ, అన్నింటికీ మనం తిలాంజలి వదలాలి.

(జనంలోనుంచి 'అవును, అవును' అని కేకలు)

ఇక్కడ మీకు మరొకవిషయంకూడా చెప్పవలసివున్నది. వివేకా నందంగారు తనవుపన్యాసంలో కొన్ని చీడపురుగులనుంచి యీసాయం

త్రమే సంఘం విముక్తిచెందినట్లు వుద్ఘాటించారు. వారు ఉద్దేశించిన వ్యక్తి ఒక్కడేవెళ్ళలేదు. అతనితోబాటు అతనికిభార్యగా వుండటానికి అంగీకరించిన యువతికూడా వెళ్ళింది.

శోభా:—(పెద్దగా) వాసంతి. వాసంతి.

వివే:—ఆ—?

కమ:—నిజమా ?

(జనంలో పెద్దఅలజడి)

వివే:—వెళ్ళిందా ?—పారిపోయిందా ? పట్టిది, అసంభవం.

రాజా:—పారిపోలేదు. అతనిభార్యగావెళ్ళింది. (పెద్దగా) వినండి. అతనికి మీరందరూ ధన్యవాదాలు అర్పించాలి. ఇతరులనేరాన్ని తనదిగా అంగీకరించి దాని ఫలితాన్ని అనుభవించటానికి సిద్ధపడిన గొప్పవ్యక్తిఅతడు. పదిహేను సంపత్సరాలనుంచి అత డేనేరస్థునిగా పరిగణించబడుతున్నాడో, దానికి కారణంనేనే. ఆనేరంచేసినవ్యక్తిని నేనే.

కమ: – ఆ.

వన:—నా బాబురావు—

శోభా:— ఇప్పటికైనా మీరుమిమ్మల్ని తెలుసుకోగలిగారు.

(జనం నిశ్శబ్దంగా రాజారామ్‌ముఖం చూస్తూఉంటారు.)

రాజా:—ఆనేరంచేసినవ్యక్తిని నేను. కాని దాన్ని అతడు తననేరంగా అంగీకరించి, దేశాంతరం వెళ్ళటంచేత అతన్ని ఆసరాగాతీసుకొని, యీ పదిహేనుసంపత్సరాలలో అబద్ధం, మోసంతో, నేడు నేనీఉచ్ఛస్థితికి రాగలిగాను—మీకు యదార్థంచెప్పుతున్నాను. ఇకమీరు నన్నుకోరుకుంటారో లేదో నిర్ణయించుకునేవిషయం మీకే వదలివేస్తున్నాను.

(జనంలోఅలజడి హెచ్చుతుంది)

కాని ఇప్పుడేమీరు నిర్ణయించుకోనక్కర్లేదు. ఎవరియింటికివారు వెళ్ళి ప్రశాంతంగా ఎవరి మనస్సులనువారు ప్రశ్నించుకొని సమాధానం తెలుసుకొనండి. నేను యదార్థాన్ని బయటపెట్టి జయాపజయాల్లో ఏది సాధించగలిగానో మీరు లోతుకుదిగి ఆలోచించుకోండి. ఇంతవరకు నేనుచేసినదానికి నేను అమితంగా బాధపడుతూనేఉన్నా. కాని అది నావ్యక్తిగతానికి సంబంధించినవిషయం.—ఇవిగో మీరిచ్చిన

మీకానుకలు తీసుకొనివెళ్ళండి. పాపకార్యానికివి పారితోషికాలు. అలాంటివి ఇకవుండకూడదని మనమందరమూ భావించాలి.— మీఅందరికీ నమస్కారాలు, ఇకవెళ్ళండి.

వివే:—(కమలాదేవితో నెమ్మదిగా) వెళ్ళిపోయిందీ ? అలాంటిస్త్రీ నాకు వద్దు (పెద్దగా కమిటీసభ్యులతో) అవును ఇంతజరిగినతరువాత మనం ఇక్కడవుండటం మంచిదికాదు. వెళ్ళిపోదాం పదండి.

జగ:—వుష్ !

(అందరూ వెళ్ళిపోతారు, గదిలో రాజారాంమ్, కమలాదేవి, వనకుమారీ శోభా, నటేశం మిగులుతారు.)

రాజా:—కమలా ! నన్నుక్షమిస్తావా ?

కమ:—నిజంగానాకు ఇది శుభదినం. ఇప్పుడుపొందినఆనందాన్ని నాజీవితంలో ఎప్పుడూ పొందలేదు.

రాజా:—ఎట్లా ?

కమ:—ఇంతవరకూ నీవునావాడివే అనుకుంటున్నాను. కాని నీవల్ల ఆనందాన్ని పొందలేకపోయాను. ఇప్పుడు నీవునావాడివికాదని తెలుసుకున్నాను. కాని జయించగలననే విశ్వాసం నాలోప్రవేశించింది.

రాజా:—కమలా ! నీవునన్ను జయించావు. శోభ నిన్నుగురించి నాకు చాలాసంగతులు చెప్పింది.—సరే మనబాబు ఎక్కడున్నాడు ?

కమ:—ఇదుగో ఇప్పుడేవస్తాడు.

(నటేశాన్ని కమలాదేవి దూరంగాతీసుకొని వెళ్ళి నెమ్మదిగా మాట్లాడుతుంది. అతడు తోటలోగుండా వెళ్ళిపోతాడు. తరువాత ఇంట్లోవున్న దీపాలు ఆరిపోతూ చీకటిక్రమ్ముకుంటూ వుంటుంది.)

రాజా:—(నెమ్మదిగా) శోభా ! నీకు ధన్యవాదాలు. నీవునన్ను రక్షించావు.

శోభా:—అంతకంటె నేనుమరొకటి చేస్తానని నీవు అనుకుంటున్నావా?

రాజా:—ఆవిషయం ఇప్పుడు నిర్ధారణగా చెప్పలేను.

శోభా:—ఆc.

రాజా:—నీవుద్వేషంతో, ప్రతీకారం చేయాలనేసంకల్పంలోలేవా? అయితే ఇక్కడకు ఎందుకు వచ్చావు ?

శోభా:—బాల్యస్నేహం మరచిపోలేక ?

రాజా:—శోభా !

శోభా:—బాబూరావు నీ రహస్యం బయటపెట్టిన తరువాత నాయౌవన నాయకుడు స్వతంత్రుడు, సత్యవాది కావాలని నేను ప్రతిజ్ఞబూనాను.

రాజా:—శోభా ! నేనుదోషిని. నీకు నేను అనర్హుడను.

శోభా:—ఓహ్ ! మాస్త్రీజాతి యెప్పుడూ అర్హతకోసం చూస్తూవుంటే—

(శ్యామలరావు రాంబాబును తీసుకొనివస్తాడు)

రాజా:—(ముందుకువెళ్ళి) రాం !

రాం:—(భయంగా) ఇంకెప్పుడూ-ఇలాంటిపనిచేయను.—

రాజా:— పారిపోవుగా ?

రాం:—వుహు ! పారిపోను.

రాజా:—కాదు. నీవు పెద్దవాడివి అయినకొద్దీ నాఅదుపు అజ్ఞల్లో వుండనక్కర్లేదు. నీజీవితలక్ష్యాన్ని నీవేనిర్ణయించుకోవాలి.

రాం:—నేను పెద్దవాణ్ణయితే నాయిష్టంవచ్చినట్లు—

రాజా:—అc. నీయిష్టంవచ్చినట్లు వుండవచ్చు.

రాం:—అయితే నేను మీలాగా సంఘనాయకుణ్ణి కావటంనాకుయిష్టంలేదు.

రాజా:—ఎందుకని ?

రాం:—అదంటేనాకు గొడవగావుంటుంది.

రాజా: —నీబుద్ధినిబట్టి నీవునడుచుకో, తక్కినది దానంతటదే జరిగిపోతుంది—శ్యామలరావూ ! నీవు—

శ్యామ:—అc. నాకుతెలుసు, నావుద్యోగం వూడిపోయింది.

రాజా:—శ్యామలరావూ ! మనం కలిసేవుంటాము. నన్ను క్షమించు.

శ్యామ:—అc. 'ఇండియన్‌గరల్' ఇవాళ బయలుదేరలేదు.

రాజా:—రేపుకూడా వెళ్ళటానికివీల్లేదు. నీకు నేనిచ్చినటైముచాలాతక్కువ. రిపైర్సుబాగా పూర్తి కావాలి.

శ్యామ:—సరే ? తప్పకుండా. తప్పకుండా. నమస్కారం. వెళ్ళివస్తాను. (బయటికి వెళ్ళుతాడు.)

కమ:—అందరూ వెళ్ళిపోయారు.

రాజా:—మనమంతావున్నాము. ఇప్పుడు నిజంగానేను వ్యక్తిగాభావించుకుంటున్నాను. నాలోయౌవనం నశించలేదు. యువకరక్తం ప్రవ

హిస్తుంది. జీవితం ఆనందమయంచేసుకోగల విశ్వాసం యేర్పడింది. కమలా! బాబూ! వనకుమారీ! మనజీవితంలో నూతనశకంప్రారంభ మయింది. మనంహాయిగా జీవించగలం.

శోభా:—నాకు విశ్వాసంలేదు. మీకుటుంబం బ్రహ్మచర్యానికి అలవాటు పడింది. మీరు ఆడవాళ్ళను శ్రద్ధగాచూడరు.

రాజా:—అవును. నీవన్నదినిజమే. అందుకేశోభా! నీవునన్ను, కమలను విడువకుండా ఇక్కడేవుండాలని నాకోర్కె.

కమ:—అవునుశోభా! నీవుతప్పకుండా ఇక్కడేఉండిపోవాలి.

శోభా:—అవును. ఇప్పుడేకొత్తకాపురం ప్రారంభించబోతున్న మిమ్మల్ని విడిచి నేనెక్కడికివెళ్ళుతాను? నేను, వనకుమారీ, మీయోగక్షేమాలు చూస్తూవుంటాము.

రాజా:—తప్పకుండా. నేనుయిప్పుడే గ్రహించగలుగుతున్నాను. సంఘ నాయకత్వానికి తగినవారు పురుషులుకాదు, స్త్రీలు అని.

శోభా:—అయితే బావా! నీవూహించినది పొరపాటని చెప్పుతున్నాను. (రాజారామ్‌భుజంమీద చేయివేసి గట్టిగానొక్కుతూ) బావా! 'సత్యం, స్వాతంత్ర్యం'—ఈరెండే సంఘాభ్యుదయానికి మూలస్తంభాలు.

